Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్ రైతు

సంపుటి: 82 • సంచిక: 38 • 14-9-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# సమాధి దశలో తెలంగాణ ఉద్యమం?

తెలంగాణ ఉద్యమం సమాధి దశలో పడింది. ఇంతకాలం ఆ ఉద్యమానికి సంకేతం, ప్రతిరూపం టిఆర్ఎస్ పార్టీ మాత్రమే. ఎవరు ఉద్యమంలో కలవాలన్నా టిఆర్ఎస్‌తో ఏదో ఒక అవగాహనకు, సయోధ్యకు రాక తప్పని పరిస్థితి. ఉద్యమం రాజకీయంగా నడవాలని మేధావులు ఒత్తిడి చేయడంతో నెలకొల్పిన రాజకీయ జెఏసి కూడా కెసిఆర్ జేబు సంస్థగానే నడిచింది ఇంతకాలం. కానీ ఇప్పుడు పరిస్థితి తారుమారైంది. ఏ కారణం వల్లనో కెసిఆర్ గత ఆరేడు నెలలుగా ఉద్యమానికి దూరంగా వున్నాడు. తెలంగాణ సాధన కోసం ఒక్క కార్యక్రమం చేపట్టడం లేదు. పరకాల ఉపఎన్నికను సైతం తేలికగా తీసుకొన్నాడు. మేధావులు, పాత్రికేయులు, విప్లవ ప్రజా సంఘాల కార్యకర్తలు తంటాలు పడి కొండా సురేఖ ధాటిని తట్టుకొని ఆ ఉపఎన్నికలో టిఆర్ఎస్‌ను చచ్చీ చెడి గెలిపించారు. దానితో ఉద్యమకారులకు భయం పట్టుకొన్నది. కెసిఆర్‌ను నమ్ముకొంటే నట్టేట ముంచుతాడనే ఆందోళనకు గురైనారు. జెఏసి ఛైర్మన్ కోదండరాం చొరవ తీసుకొని, కెసిఆర్ వద్దకు వెళ్లి, ఉద్యమం చల్లారి పోయిందన్న ప్రచారం జరుగుతున్నది. ఒకసారి ఆ నిప్పు ఆరితే మళ్లీ రగిలించడం కష్టం కాబట్టి, ఏదో ఒక కార్యక్రమం చేపడదామని కోరాడు. కానీ కెసిఆర్ పెద్దగా స్పందన చూపలేదు. ఢిల్లీ నుంచి నాకు స్పష్టమైన సంకేతాలున్నాయి, తెలంగాణ ఇచ్చేస్తున్నారు కాబట్టి ఉద్యమాన్ని ఉధృతం చేయవలసిన అవసరం లేదని ఖరాఖండిగా చెప్పేశాడు. దానితో జెఏసి కూడా అయోమయానికి గురైంది. ఉద్యమం వేడి లేకుండా ఢిల్లీ సర్కారు తెలంగాణ ఎందుకు ఇస్తుందన్నది వారి ప్రశ్న.

జెఏసి నేతలకు కెసిఆర్ మీద అనుమానాలు రావడంతో, తమంత తాముగా సెప్టెంబర్ 30తేది తెలంగాణ మార్చ్ కార్యక్రమం ప్రకటించారు. ఇన్నేళ్ల ఉద్యమ చరిత్రలో కెసిఆర్ ప్రమేయం లేకుండా ప్రకటించిన ఏకైక కార్యక్రమం ఇదొక్కటే. దాని విషయంలో ఇప్పటికీ టిఆర్ఎస్ మౌనంగానే వుంది. అందులో తాము పాల్గొంటున్నదీ లేనిదీ చెప్పడం లేదు. తన ఆజ్ఞ లేకుండా కోదండరాం స్వంత కార్యక్రమం ప్రకటించడం కెసిఆర్‌కు కన్నెర్ర చేసింది. కానీ ఏమీ చేయలేని స్థితి. ఆ మార్చ్ విజయవంతమైతే, ఉద్యమంలో టిఆర్ఎస్ పార్టీ, కెసిఆర్ నాయకత్వం నామమాత్రమై పోతాయి. ఇప్పటివరకు ఉద్యమానికి సంకేతంగా వున్న స్థానం చేజారి పోతుంది. అట్లని ఉద్యమంలో ముందు వరసలో నిలబడితే, జెఏసికి లొంగిన వాడౌతాడు. దానితో ఎట్లయినా సెప్టెంబర్ 30తేది లోపల ఢిల్లీ నుంచి తెలంగాణ అనుకూలంగా ఏదో ఒక ప్రకటన చేయించాలని తంటాలు పడుతున్నాడు కెసిఆర్. అందుకోసం ఢిల్లీలో వాయిలార్ రవి వంటి కాంగ్రెస్ నేతల ఇళ్ల చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నాడు.

మరొకప్రక్క తెలంగాణ రెడ్డి కులానికి చెందిన రాజకీయ వాదులందరికీ కుల పరమైన ఆందోళన పట్టుకొని వుంది. తెలంగాణ ప్రజలు ప్రత్యేక రాష్ట్రానికి అనుకూలురైన పార్టీలకు మాత్రమే ఓటు చేస్తారన్నది నిరూపితమైన నిజం. ఇప్పటి వరకు ఆ అవకాశం ఒక్క టిఆర్ఎస్‌కు మాత్రమే వుంది. రాజకీయ భవిష్యత్తు కావాలంటే ఆ పార్టీలో చేరక తప్పడం లేదు. కానీ కెసిఆర్ వంటి దొరతనం పోకడ వున్న వాడి నాయకత్వం క్రింద పని చేయడం వారికి ఇష్టం లేదు. తెలుగుదేశం, కాంగ్రెస్, జగన్, బిజెపి పార్టీలకు చెందిన రెడ్లందరికీ ఇప్పుడు ఇదొక ఆందోళనగా మారింది. కెసిఆర్ ఢిల్లీలో ఏమి చేస్తున్నాడో, కేంద్రం తెలంగాణ విషయంలో ఏమి చేయనున్నదో ఎవరికీ అర్థం కావడం లేదు. దానితో ఆందరూ కలిసి కేంద్రమంత్రి జైపాల్‌రెడ్డి వద్దకు రాయబారం వెళ్లారు. జానారెడ్డి, కోమటిరెడ్డి రాజగోపాల్‌రెడ్డి, గండ్ర వెంకటరమణారెడ్డి, ఇంద్రకరణ్‌రెడ్డి, బండి నరసారెడ్డి వంటి వారందరూ ఒక జట్టుగా వెళ్లి జైపాల్‌ను నిలదీశారు. మా తరఫున పెద్దగా వుండే నువ్వు ఉలుకు పలుకు లేకుండా కాలం గడిపితే ఎట్లా అని గట్టిగా అడిగారు. దానితో జైపాల్‌రెడ్డి ఢిల్లీలో ఇప్పట్లో తెలంగాణ ఇచ్చే సూచనలేవీ లేవని వారికి వివరించి చెప్పాడు. నాకు తెలియకుండా ఏ కదలికా వుండదని స్పష్టం చేశాడు.

అది రెడ్డి జన సంఘంలో మరింత భయాన్ని

కొరవ 14వ పేజీలో

## విజయమ్మ మనసులో దాగిన నిజం ఏమిటి?



వైఎస్ విజయమ్మకు రాజకీయాలు తెలియవు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి సతీమణిగా ఇంటి పట్టున వుండడమే తప్ప ఏనాడు కూడా రాజకీయాలలోకి రాలేదు. ఇప్పుడు జగన్ కోసం జనంతో కలవక తప్పడం లేదామెకు. కానీ అనుభవం లేకుండా రాజకీయాలు చేయడం అంత సులభం కాదు. జగన్ సూచన మేరకు చేపడుతున్న దీక్షలు, నిరసనలు, సభలకు పార్టీ ఏర్పాట్లు జరుపుతున్నది కాబట్టి, నడిచి పోతున్నది. అయితే పత్రికల వారితో పలకరింపు తప్పనప్పుడే సమస్య వస్తున్నది. హైదరాబాదులో జరిగిన ఫీజుల నిరసన సభలో ఇదే జరిగింది. పిటిఐకి చెందిన ఒక సీనియర్ విలేకరి ఆమెను మాటలలో పెట్టాడు. యధాలాపంగా అడిగినట్లు, జగన్ పార్టీ కాంగ్రెస్‌లో విలీనం కాబోతున్నదా అని అడిగాడు. దానికామె అమాయకంగా "కాలమే నిర్ణయిస్తుంది" అనే సమాధానం ఇచ్చారు. దాన్ని టీవీ

కొరవ 14వ పేజీలో

# భావాన్ని బంధించలేరు

కార్టూనిస్టు అసీం త్రివేది అరెస్టు ఉదంతం దేశంలో భావ ప్రకటన స్వేచ్ఛపై విస్తృత స్థాయి చర్చకు దారి తీస్తున్నది. పాతికేళ్ల పసిప్రాయంలో వున్న ఈ ఉత్తరప్రదేశ్ కార్టూనిస్టు ఒక్కసారిగా అంతర్జాతీయ ఖ్యాతి నార్జించాడు. దేశంలో పెచ్చరిల్లిన అవినీతిపై కలాన్ని ఝళిపించడం అసీం త్రివేదికి మొదటి నుంచి ఆనవాయితీ. పెద్ద పెద్ద పత్రికలు ఆయన కార్టూన్లను ప్రచురించడానికి సాహసించలేక పోవడంతో, ఇంటర్నెట్‌లో వెబ్‌సైట్ ద్వారా తన కలం ప్రతాపాన్ని ప్రదర్శిస్తున్నాడు. అయితే అది ప్రభుత్వాలకు సహ్యం కాలేదు. గత ఏడాది అన్నా హజారే జనలోక్‌పాల్ బిల్లు కోసం దీక్ష చేపట్టినపుడు మహారాష్ట్ర పోలీసులు అసీం వెబ్‌సైట్‌పై క్రిమినల్ కేసులు మోపి, మూత వేయించారు. దానితో ఆయన తన కార్టూన్లను బహిరంగ ప్రదేశాలలో పోస్టర్లుగా ప్రదర్శించడం మొదలు పెట్టాడు. భారత రాజ ముద్రిక అయిన మూడు సింహాల స్థానంలో మూడు తోడేళ్లను పెట్టి, సత్యమేవ జయతే బదులుగా భ్రష్టమేవ జయతే అనే నినాదం వ్రాశాడు అసీం. తాజాగా పార్లమెంట్ భవనాన్ని మరుగుదొడ్డిగా చిత్రించి, పక్కనే బ్యాలెట్ పేపర్‌ను టాయిలెట్లో వాడే కాగితంగా చూపిస్తూ ఒక కార్టూన్ గీశాడు. అది రాజకీయ వాదులకు వుడుకు పుట్టించింది. పార్లమెంట్‌లో పలువురు ఎమ్పీలు దీనిపై అభ్యంతరం చెప్తూ ఆందోళన చేశారు. బొంబాయి నగరానికి చెందిన ఒక న్యాయవాది, అసీం కార్టూన్లు రాజ్యాంగ బద్ధ సంస్థలను అవహేళన చేస్తున్నాయని ఫిర్యాదు చేయడంతో, పోలీసులు ఆయనపై దేశ ద్రోహ నేరం మోపి, అరెస్టు చేశారు. ఆ నిర్బంధానికి అసీం భయపడలేదు. కోర్టులో తన తరపున వాదించడానికి న్యాయవాదిని పెట్టుకోవడానికి కానీ, బెయిల్ దరఖాస్తు చేయడానికి కానీ ఒప్పుకోలేదు. ఒక యువ కార్టూనిస్టును దేశ ద్రోహ నేరం క్రింద అరెస్టు చేయడంపై ప్రపంచ వ్యాప్తంగా మేధావులు, కళాకారులు, పత్రికా రచయితలు ఆందోళన మొదలు పెట్టారు. దాని ధాటికి బొంబాయి సర్కారు తల్లడిల్లిపోయింది. మహారాష్ట్ర హోం మంత్రి స్వయంగా జైలుకువెళ్లి దేశ ద్రోహ నేరం ఉపసంహరిస్తామని హామీ ఇచ్చి, అసీంను జైలు నుంచి బయటకు తీసుక రావలసి వచ్చింది.

దేశ ద్రోహ నేర చట్టం, బ్రిటీష్ దొరలు స్వాతంత్ర్య సమర వీరులను అణచడానికి వ్రాసుకొన్న క్రూర చట్టాలలో ఒకటి. దాన్ని ఒక కార్టూనిస్టు మీద ప్రయోగించి, భావ ప్రకటన స్వేచ్ఛను బంధించాలని చూడడం ప్రభుత్వం చేసిన వెర్రి చేష్ట.

అయితే పార్లమెంట్ అనేది రాజ్యాంగానికి మాత్రమే కాదు, మొత్తం ప్రజాస్వామిక వ్యవస్థకే ఒక సంకేతం. అరవై ఏళ్లుగా మన దేశాన్ని నడిపిస్తున్నది పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అన్న నిజాన్ని మరవకూడదు. పొరుగునే వున్న పాకిస్తాన్‌కు మనకు గల తేడాను చూస్తేనే పార్లమెంట్ సాధించిన ఘనత అర్ధమౌతుంది. అయితే ఆ పార్లమెంట్‌కు ఇప్పుడు ఎన్నిక అవుతున్న వారిలో అధిక సంఖ్యాకులు రాజకీయ వ్యవస్థలో అవినీతిని పెంచి పోషిస్తున్న వారే అన్నది కూడా నిజం. లోక్‌సభలో నోట్ల కట్టల ప్రదర్శన, ప్రశ్న అడగడానికి డబ్బు తీసుకోవడం, ఓటుకు నోటు ఇచ్చి ఎన్నిక కావడం, అవినీతితో దేశాన్ని దోచుకొన్న వారికి మద్దతు పలకడం వంటి దురదృష్టకర సంఘటనలు పార్లమెంట్ ప్రతిష్టను మసక బారుస్తున్నాయి. అంత మాత్రాన మొత్తం పార్లమెంట్ వ్యవస్థే పనికిమాలినదని ప్రచారం చేయడం, దాన్నొక మరుగు దొడ్డితో పోల్చడం సమర్ధనీయం కాదు. ఎందరో జాతి నేతలు, ఎంతో మేధో మదనం జరిపి నెలకొల్పిన వ్యవస్థ అది. అన్నా హజారే పక్కన చేరిన నలుగురైదుగురు వ్యక్తులు పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని రద్దు చేయాలని, ప్రెసిడెంట్ పాలన పద్ధతి ప్రవేశపెట్టాలని ఒత్తిడి చేసినంత మాత్రాన రాజ్యాంగాన్ని తిరగ వ్రాయాల్సిన అవసరం లేదు. తమ ప్రచారం కోసం వారు రాజ్యాంగ బద్ధ సంస్థల మీద బురద చల్లడాన్ని కూడా ప్రోత్సహించవలసిన అవసరం లేదు. అయితే వారికి తమ భావాలను ప్రచారం చేసుకొనే హక్కు వుందన్న రాజ్యాంగ సూత్రాన్ని తప్పకుండా గౌరవించి తీరాలి. వారి వాదనతో ఏకీభవించకపోయినా, వారు అట్లా వాదించే హక్కును కలిగి వున్నారన్న నిజాన్ని ఒప్పుకొని తీరాలి. ప్రజాస్వామ్య మౌలిక తత్వంలో ఆసహనం ఒక భాగం. ఎన్ని చేదు అనుభవాలు అనుభవించినా, ప్రభుత్వాలు భావ ప్రకటన స్వేచ్ఛ విషయంలో క్రూరమైన చట్టాలను ప్రయోగించే అలవాటును మానుకోలేక పోవడం శోచనీయం. ప్రభుత్వాలు ఆ తప్పు చేసిన ప్రతిసారీ ప్రజలు దాన్ని ప్రతిఘటించి మరీ పై చెయ్యి సాధించడం సంతోషించవలసిన అంశం. ఇప్పుడు అసీం విషయంలో జరిగింది కూడా అదే.

## జనవాణి

### వినాయకునిపై కార్టూన్స్, జోక్స్‌వద్దు!

వినాయక చవితి పండుగ హిందువులకు ఎంతో ముఖ్యమైన పండుగ. మొదటి పండుగ కూడా. అయితే ఈ పండుగపై నెలరోజుల ముందు నుంచే రాజకీయాలు, చందాల వ్యాపారాలు మొదలవుతాయి. పత్రికల్లో వినాయకునిపై హాస్య చిత్రాలు వేస్తారు. వాఖ్యానాలు వ్రాస్తారు. ఇవి భక్తుల మనోభావాలను దెబ్బతీస్తాయి. ఇతర మతాల్లోని దేవతలపై పొరపాటున కూడా ఇటువంటి కార్టూన్స్, జోక్స్‌రావు. ఈ విషయమై హిందూమత గురువులు ఒక ప్రకటన చేస్తే బాగుంటుంది. వినాయక చవితి ఉత్సవాల్లో రికార్డు డ్యాన్సులు ఏర్పాటు చేయకుండా చూడాలి. పర్యావరణానికి హాని కలగని రీతిలో వినాయక విగ్రహాల ఏర్పాటుకు నిర్వాహకులు యత్నించమనవి.

సోలా జానకీ దేవి — నెల్లూరు

### అన్నీ చోట్ల దొంగలే!

నెల్లూరు పెద్దసుపత్రిలోని బ్లడ్ బ్యాంకులో రక్తాన్ని ఒంగోలుకు అక్రమంగా తరలిస్తూ ఇద్దరు ప్రబుద్ధులు పట్టుబడ్డారు. వీరిలో ఒకరు బ్లడ్‌బ్యాంక్ టెక్నీషియన్ కావడం బాధాకరం. రెడ్‌క్రాస్ బ్లడ్‌బ్యాంకు నిర్వాహణ తీరుపై ఆరోపణలు రావడంతో ఈ మధ్య రక్తదానం చేసేవాళ్లంతా పెద్దాస్పత్రిలోని బ్లడ్‌బ్యాంకుకు ఇస్తున్నారు. ఎవరికి వారే అనే ఈ రోజుల్లో రక్తదానం చేయడం మామూలు విషయం కాదు. ఏళ్ల, పూళ్లుగా కొందరు మహనీయులు చేసిన కృషి ఫలితంగా నెల్లూరులో రక్తదాన ఉద్యమం ఊపందుకొంది. అటువంటి చోట ఈ అవినీతి అక్రమాలు సహించరానివి. దోషులపై కఠిన చర్యలు, ఆయా విభాగాల్లో తక్షణ సంస్కరణలకు జిల్లా కలెక్టర్ పూనుకోవాలి.

పి.అరుణకుమారి — నెల్లూరు

### ఉదార హృదయులు!

నెల్లూరీయులు ఉదార హృదయులు. ఎక్కడ ఎవరికి ఆపద, ఇబ్బంది కలిగినా ముందుకొచ్చి ఆదుకొంటారు. తల్లి చేత హింసింపబడి శరీరంపై 53గాయాలైన చిన్నారి నర్తన పేరిట రెండులక్షలా 24వేలు జనం డిపాజిట్ చేయడం మామూలు విషయమేమి కాదు. నర్తనను తీవ్రంగా హింసించినందుకు ఆమె తల్లి చైతన్య, ప్రియుడు నగేష్‌కు కోర్టు కఠిన కారాగార శిక్ష విధించడం అభినందనీయం. భవిష్యత్తులో మరెవ్వరూ ఇటువంటి అరాచకాలు చేయను ముందుకు రాకపోవడానికి కోర్టు తీర్పు దోహదపడుతుందని విశ్వసిస్తున్నాను.

ఎ.ఎస్.రాయలు — నెల్లూరు

### వైఫల్యాలు ఉన్నాయి!

ఆగష్టు 17వతేది 'జమీన్‌రైతు' సంచికలో న్యూస్‌టైమ్ పత్రిక డెక్కన్‌క్రానికొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

20-9-1942
పేజీలు : 8 వెల: అణా

నెల్లూరు వెంకట్రామానాయుడు గారు వార్తలను పద్యరూపంలో వ్రాసే విలక్షణశైలికి సృష్టికర్తలు. 70 ఏళ్ల క్రితం జమీన్‌రైతు సంచికలో అటువంటి వార్త ఒకటి ఇది.

– సం.జ.రై

### కాకినాడ ఎన్నికల పరాభవాధ్యాయం

విశాల విపణి శ్రేణి భూషితాలంకార శోభితంబైన కాకినాడ పురవరంబున అన్నదాన
సమాజాంతర క్రోటన్సు పరిసరాంగణ ప్రదేశ ఆంధ్ర రాష్ట్ర కాంగ్రేసు సంఘ సమా
వేశ సందర్భ సమాగమ నానావిధ రాజకీయమిత్ర సంభాషితానంతర ఆలిండియా
కాంగ్రేసు కమిటీ సభ్యత్వ ఎన్నిక నిరాశాపూరిత చిత్తాం దోళితమానసాంబుంధై గత్యంతరము
గానక వెన్నెలకంటి వంశ పయ:పారావారరాకా సుధాకరండగు

రాఘవయ్య పంతుల వారు ప్రత్యర్థి పక్ష నాయకా గ్రేసునుండైన తిక్కవరపు రామిరెడ్డి గారిందరికి ఇట్లని విన్నవించె–

ఉ. చేసితి నెన్నియో వెకిలిచేష్టల నీయడ మిత్రులందునే
జేసినవన్ని వెన్దిరిగి చెందెనుగాక మహాపరాధుడన్
దోసిలి యొగ్గి వేడెద యధోచిత రీతిని ఓట్లనివ్వవే!
దోసము వెంచరే కద బంధోత్తమ లాపద వేళ రెడ్డిలా!

## 50 ఏళ్ల క్రితం ఈవారం

14-9-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### పంచాయితీ రాజ్యంగాదు – ఎలక్షన్ రాజ్యం!

తన అభిప్రాయాలను నిర్మొగమాటంగా, నిర్భయంగా, నిస్సంకోచంగా, పల్లెటూరి భాషలో వెలువరించడంలో మాజీ మంత్రి పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి గారికి ఎవ్వరూ సాటి రారేమోననిపిస్తుంది. గత వారంలో హైదరాబాద్ వద్ద ఒక సభలో పంచాయితీ రాజ్యాన్ని గుర్చి ఉపన్యసిస్తూ పంచాయితీ రాజ్యంగాదని, ఎలక్షన్ రాజ్యమని వెలిబుచ్చారు. ఒక సమితిలో ఒక సభ్యుని ఓటు 28వేల రూపాయలకు కొనబడిందట. అక్షర లక్షలుజేసే మాటలివి.

### నెల్లూరు ముచ్చట్లు
### నెల్లూరు పాలిటెక్నిక్

నెల్లూరు నుండి పాలిటెక్నిక్‌ను ఇతర జిల్లాలకు బదలీ చేయరాదని ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం నిర్ణయించడం హర్షించతగిన విషయం. నెల్లూరులో పాలిటెక్నిక్ యేర్పాటుజేసే సందర్భంలో రేబాల లక్ష్మీనరసారెడ్డి, పొన్నలూరు వీరరాఘవరెడ్డి సోదరులు రూ. రెండు లక్షలు విరాళమిస్తామని వాగ్దానం జేశారు. వీరి వాగ్దానం మీదనే నాటి మంత్రి ఏ.సి గట్టిగా పట్టుబట్టి గోపాలరెడ్డి గారి సాయంతో పాలిటెక్నిక్ సంస్థను నెల్లూరుకు సాధించి పెట్టారు. కానీ నాటి విద్యాశాఖ మంత్రి పట్టాభిరామారావు గారు కనీస మర్యాదను గూడా పాటించలేదని కినుక వహించిన రేబాల లక్ష్మీనరసారెడ్డి తన వాగ్దానాన్ని ఉపసంహరించుకోవడంతో ప్రతిష్టంభన ఏర్పడింది. విరాళం ఇవ్వకపోతే మరో చోటుకు తరలించవలసి వస్తుందని విద్యామంత్రి పట్టాభి రామారావు మంత్రివర్గ సమావేశంలో ఏ.సిని నిలదీశారట. ఆ తర్వాత ఏమి జరిగిందో ఏమో రెండు లక్షలు ఇవ్వకపోయినా నెల్లూరు పాలిటెక్నిక్‌ను కొనసాగిస్తామని నీలం సంజీవరెడ్డి ప్రకటించారు.

# నెల్లూరు ముచ్చట్లు

## దుగరాజపట్నంలో పోర్ట్‌పై నివేదిక అడిగిన పిఎం!

దుగరాజపట్నంలో ఓడరేవు నిర్మాణానికి అన్ని పరిస్థితులు అనుకూలంగా ఉన్నా ఇస్రో అభ్యంతరాలు వ్యక్తం చేయడంతో ఈ ప్రతిపాదన వెనక్కు వెళ్లిన విషయం పాఠకులకు విదితమే. 8వ తేది రాకెట్ ప్రయోగం వీక్షణకు శ్రీహరికోటకు వచ్చిన ప్రధాని మన్మోహన్‌సింగ్ దృష్టికి ప్రజాప్రతినిధులు పోర్టు విషయాన్ని తీసుకెళ్లగా ఇస్రో ఛైర్మన్‌ను ఈ విషయమై మరో నివేదిక ఇవ్వమని ప్రధాని కోరారు. శ్రీకాళహస్తి – నడికుడి రైల్వే లైనుకు సర్వే పూర్తయినా పనుల ప్రారంభానికి శంకుస్థాపన చేయని విషయాన్ని ప్రజాప్రతినిధులు ప్రధాని దృష్టికి తీసుకొచ్చారు. మన్మోహన్‌సింగ్‌ను కలిసిన ప్రతినిధి బృందంలో జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి పితాని సత్యనారాయణ, నెల్లూరు, తిరుపతి ఎమ్పీలు మేకపాటి రాజమోహన్ రెడ్డి, చింతా మోహన్, ఎమ్మెల్యేలు పరసా రత్నం, మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, ఎమ్మెల్సీలు వాకాటి నారాయణరెడ్డి, విఠపు బాలసుబ్రహ్మణ్యం ఉన్నారు. వీరితో ప్రధాని కేవలం ఏడు నిమిషాలు మాత్రమే మాట్లాడడం విమర్శకు దారి తీసింది. ప్రధానికి శ్రీహరికోటలో రిజర్వుడు సమయం బాగానే ఉండింది.

## రాకెట్ ప్రయోగం చూడలేకపోయిన ప్రజలు!

ఇస్రో తన వందో ప్రయోగంగా పిఎస్ఎల్వీ–21 రాకెట్‌ను 9వ తేది శ్రీహరికోట నుంచి నింగిలోకి ప్రవేశపెట్టింది. ప్రపంచ దేశాలన్నీ ఈ ప్రయోగంపై దృష్టి పెట్టాయి. కానీ నెల్లూరీయులు మాత్రం టీవీల్లో కూడా ఈ ప్రయోగం చూడలేక పోయారు. ఈ సమయంలో జిల్లావ్యాప్తంగా విద్యుత్‌కోత విధించి ఉండినారు. దీనివల్ల షార్‌లో ఉండిన ఉద్యోగులు, వారి కుటుంబాలు, ప్రత్యేకంగా విచ్చేసిన అతిథులు, అక్కడే ఉండిన మీడియా మాత్రం ప్రత్యక్ష ప్రయోగాన్ని చూడగలిగింది.

## కళ్ల శక్తి చాలలేదు!

శ్రీహరికోట నుంచి ఇస్రో ప్రయోగించిన పిఎస్ఎల్వీ–21 రాకెట్ 9వ తేది లాంచ్ ప్యాడ్ నుంచి పైకిలేచిన సమయంలో రెండు కిలోమీటర్ల దూరంలోని మీడియా సెంటర్ కప్పు మీద ఉన్న విలేకరులు, ఫోటో, వీడియో గ్రాఫర్లు కొన్ని సెకన్లు మాత్రమే దాని గమనాన్ని చూడగలిగారు. కళ్లు చూడలేనంతగా రాకెట్ నిప్పులు చిమ్ముతూ మబ్బుల్లో మాయమవడం జరిగిపోయింది.

## ఇస్రో ఛైర్మన్‌లో భక్తిభావం!

భారత అంతరిక్ష పరిశోధనా సంస్థ ఛైర్మన్ రాధాకృష్ణన్ వృత్తిరీత్యా శాస్త్రవేత్త అయినా ప్రవృత్తిరీత్యా దైవభక్తుడని లోకానికి చాటారు. పిఎస్ఎల్వీ–21 రాకెట్ ప్రయోగానికి ముందు తిరుపతి వెంకన్న, శ్రీకాళహస్తి ముక్కంటి, సూళ్లూరుపేట చెంగాళమ్మలకు ప్రత్యేక పూజలు చేశారాయన. రాకెట్ ప్రయోగం రోజు సైతం ఆయన నుదిటిపై కొట్టొచ్చినట్లు ఎర్రటి బొట్టు కనపడడం విశేషం. ఎంత గొప్ప శాస్త్రవేత్త అయినా భగవంతుని సృష్టి తర్వాతేనని రాధాకృష్ణన్ ప్రవర్తన ఋజువు చేసింది. కానీ దీన్ని హేతువాదులు ఒప్పు కోరుగా?

## షార్‌లో 'క్యాటరింగ్' భోజనం!

పాత రోజుల్లో షార్‌లో రాకెట్ ప్రయోగమంటే హడావుడి, అతిథులకు అందే గౌరవమర్యాదలు మరపురానివిగా ఉండేవి. మీడియాను ఎంతో అప్యాయంగా నెల్లూరు నుంచి తీసుకెళ్లి, అదే మన్ననతో వదలి వెళ్లేవారు షార్ పిఆర్వో రవీంద్రనాథ్. ఆయన పదవీ విరమణ చేయడంతో ఈసారి విలేకరుల సందేహాలు తీర్చేవారు, సలహాలు ఇచ్చేవారు లేకుండా పోయారు. మీడియాకు అత్యంత నాసిరకమైన క్యాటరింగ్ టిఫిన్, భోజనం పెట్టడంతో వేకువజామున అక్కడకు బయలుదేరిన నెల్లూరు మీడియా ఇబ్బంది పడాల్సి వచ్చింది. కమీషన్‌కు కక్కుర్తిపడి ఎవరో అధికారి చేసిన ఏర్పాటే ఈ ఎన్టీఆర్‌నగర్ క్యాటరింగ్ అని తెలిసింది.

## ఈ – సేవలో నెం.1

రాష్ట్రవ్యాప్తంగా ఈ – సేవలు అమలులో ఉన్న జిల్లాలలో నెల్లూరు జిల్లా ముందంజలో ఉందట. 10వ తేది విజయవాడలో జాయింట్ కలెక్టర్లతో జరిగిన మీ – సేవ, ఈ–వాణి కార్యక్రమాల సమీక్ష, అవగాహన సమావేశాలను రాష్ట్ర సమాచార కమిషనర్ సంజయ్‌జాజు నిర్వహించారు. ఈ సమావేశంలో ఈ – సేవను జిల్లాలో సమర్థవంతంగా అమలు చేస్తున్న ఇన్‌ఛార్జ్ జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం ను ప్రశంసించారు.

రేషన్ కార్డులో అడ్రసు మార్చను ఆరు నెలలకు కూడా ఈ – సేవలకు సాధ్యం కావడం లేదు. మరెలా రాష్ట్రంలో నెం.1నో జాజుగారే చెప్పాలి?

## డికెడబ్ల్యులో దూరిన అగంతకులు!

నెల్లూరు డికెడబ్ల్యు హాస్టళ్లు గతంలో ఎప్పుడూ వార్తల్లో ఉండేవి. ఈ మధ్య కాస్త గొడవలు తగ్గాయి. గతవారం ఓ అగంతకుడు రాత్రివేళ హాస్టల్‌లో ప్రవేశించడంతో విద్యార్థినులు భయభ్రాంతులకు గురయ్యారు. ఈ సంఘటన జరిగాక చాలా మంది డికెకు వెళ్లి విద్యార్థినులను పరామర్శించారు. కానీ ఇంతవరకు కాలేజి వద్ద రాత్రి సమయంలో రక్షణకు ఒక్క కానిస్టేబుల్‌ను కూడా పెట్టకపోవడం బాధాకరం.



## ప్రధాని పర్యటనకు రాని బ్రదర్స్!

నెల్లూరులో ఏ చిన్న కార్యక్రమం జరిగినా దానికి తప్పనిసరిగా హాజరయ్యే ఆనం వివేకానందరెడ్డి 8, 9 తేదీల్లో జరిగిన ప్రధాని మన్మోహన్‌సింగ్ పర్యటనకు హాజరు కాలేదు. విచిత్రంగా ఆయన సోదరుడు ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి కూడా చివరి క్షణంలో శ్రీహరికోట పర్యటనను రద్దు చేసుకొన్నారు.

## పెద్దాసుపత్రి రక్తనిధికి కొత్త ఇన్‌ఛార్జ్!

నెల్లూరు పెద్దాసుపత్రి రక్తనిధి ఇన్‌ఛార్జ్‌గా మానసిక వైద్య నిపుణుడు గంగాధర్‌ను నియమించారు. డాక్టర్‌గా గంగాధర్‌కు మంచిపేరున్నా ప్రజా సంబంధాల నిర్వహణలో ఆయనకు అనుభవం లేదు.

పెద్దాసుపత్రిలో రక్తం ప్యాకెట్లతో పట్టుబడిన నిందితులు ఇన్‌ఛార్జ్ డాక్టర్ కృష్ణమూర్తికి కూడా ఈ వ్యవహారంలో ప్రమేయముందని చెప్పడంతో ఆయన 10వ తేది నుంచి సెలవులో వెళ్లడంతో కొత్త ఇన్‌ఛార్జ్‌ను నియమించాల్సి వచ్చింది.

## నారాయణ భాస్కర్‌రెడ్డికి ప్రమోషన్!

నారాయణ మెడికల్ కాలేజిలో పిఆర్వోగా ప్రస్థానం మొదలుపెట్టిన భాస్కర్‌రెడ్డి ఆ కాలేజి ఏరియా జనరల్ మేనేజర్‌గా పదోన్నతి సాధించి 10వ తేది ఆ బాధ్యతలు చేపట్టారు. భాస్కర్‌రెడ్డి మృదు స్వభావి. సహాయకారి. అందువల్లే సంస్థలో త్వరగా పదోన్నతి పొందగలిగారు. భాస్కర్‌రెడ్డి పదవీ స్వీకార కార్యక్రమంలో నారాయణ సంస్థల జనరల్ మేనేజర్ వేమిరెడ్డి విజయభాస్కర్‌రెడ్డి, జనరల్ హాస్పిటల్ కో ఆర్డినేటర్ డాక్టర్ సర్వేపల్లి విజయకుమార్ ఇతర విభాగాల డాక్టర్లు పాల్గొన్నారు.

## ప్రముఖ హాస్పిటల్‌లో రచ్చ!

నెల్లూరు బృందావనంలో ప్రముఖ ప్రసూతి హాస్పిటల్‌లో వైద్యం సరిగ్గా అందక పసికందు మరణించడంతో 10వ తేది హాస్పిటల్ ఎదుట జనం ధర్నా నిర్వహించారు. బంగ్లాతోటకు చెందిన రవికుమార్ ఆయన భార్య ఉదయలక్ష్మిని గర్భం దాల్చిన సమయం నుంచి ఈ హాస్పిటల్‌లోనే చూపిస్తున్నాడుట. నెలలు నిండడంతో ఈమెను 8వ తేది హాస్పిటల్‌లో చేర్పించాడు. 9వ తేది రాత్రి సమయంలో ఉదయలక్ష్మికి ప్రసవ నొప్పులు రాగా సరిగ్గా పట్టించుకోక పోవడంతో కడుపులోని శిశువు మరణించడంతో పాటు తీవ్ర రక్తస్రావంతో గర్భిణి ప్రాణం సైతం ప్రమాదంలో పడింది. వైద్య నిర్లక్ష్యాన్ని నిరసిస్తూ రవికుమార్ బంధువులు ఆందోళనకు దిగగా పోలీసులు వచ్చి వ్యవహారాన్ని సర్దుబెట్టారు. ఉదయలక్ష్మిని మెరుగైన చికిత్స కోసం చెన్నై తరలించారు.

నగరంలో పేరుగాంచిన గైనకాలజిస్టులు శక్తికిమించి గర్భిణులను తమ క్లినిక్‌లో చేర్చుకొని కాన్పు సమయంలో వైద్యం చేయలేక చేతులెత్తేస్తున్న సంఘటనలు ఇటీవల కాలంలో ఎక్కువయ్యాయి. వైద్యోధనమో హరిః అనాల్సిన రోజులివి. ఏం చేస్తాం?

## ప్రధాని రాజీనామా చేయాలి

బొగ్గు కుంభకోణంలో దేశ ప్రతిష్ట భ్రష్టుపట్టేలా చేసిన ప్రధాని మన్మోహన్ సింగ్ నైతిక బాధ్యత వహించి తన పదవికి రాజీనామా చేయాలని బిజెపి అధికార ప్రతినిధి సన్నపరెడ్డి సురేష్‌రెడ్డి నెల్లూరులో ఆలస్యంగా డిమాండ్ చేశారు. పార్టీ కార్యాలయంలో లేటుగా ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో యుపిఏ ప్రభుత్వం అవినీతి ఊబిలో కూరుకుపోయిందని ఈ విషయాన్ని ప్రజలకు తెలియజెప్తామన్నారు. ఈ సమావేశంలో బిజెపి నేతలు కర్నాటి ఆంజనేయరెడ్డి, మిడతల రమేష్ పాల్గొన్నారు.

## డైట్ ప్రిన్సిపాల్‌గా జిలానీబాషా!

రాజీవ్ విద్యామిషన్ ప్రాజెక్ట్ ఆఫీసర్‌గా పనిచేస్తుండిన జిలానీ బాషాను పల్లెపాడులోని ఉపాధ్యాయ శిక్షణా సంస్థ (డైట్) ప్రిన్సిపాల్‌గా నియమించారు. డైట్‌కు జిలానీబాష పాతకాపే. ఇక్కడ ఆయనకు లెక్చరర్‌గా పనిచేసిన అనుభవముంది.

## రైల్వేమంత్రిని కలసిన మేకపాటి!

నెల్లూరు పార్లమెంటు సభ్యుడు మేకపాటి రాజమోహన్‌రెడ్డి 6వ తేది పార్లమెంటులో రైల్వే మంత్రి ముకుల్‌రాయ్‌ను కలసి శ్రీకాళహస్తి – నడికుడి రైల్వే పనులు ప్రారంభించమని కోరారు. ఈ మార్గం నిర్మాణం వల్ల నెల్లూరు, ప్రకాశం, గుంటూరు జిల్లాలలో ఇప్పటివరకు రైలు చూడని మెట్ట ప్రాంత ప్రజలకు ఎంతగానో ఉపయోగపడుతుందన్నారు. ఈ ప్రాజెక్ట్ పనులు పూర్తయితే హైదరాబాద్, చెన్నైల మధ్య ప్రకృతి విపత్తుల సమయంలోనూ రైళ్లు నడపవచ్చన్నారు. ఈ రైలు మార్గానికి అవసరమైన నిధులు సగం భరించడానికి రాష్ట్ర ప్రభుత్వం ముందుకొచ్చిన విషయాన్ని కూడా ఎమ్పీ రైల్వే మంత్రి దృష్టికి తీసుకొచ్చారు.

కొరవ 14వ పేజీలో

# నెల్లూరు గోడౌన్లలో సన్నబియ్యం అక్రమ నిల్వలు!

- లోగుట్టంతా పౌరసరఫరాల శాఖ అధికారులకెరుక... కానీ తెలియనట్లు నటన!

నెల్లూరు రైసుమిల్లర్లు, బియ్యం వ్యాపారులు వేల టన్నుల సన్నాల రకం బియ్యాన్ని గోడౌన్లలో అక్రమ నిల్వచేసి పెట్టడంతో ఒక్కసారిగా ఈ రకం బియ్యం రేట్లు కిలోకు పది రూపాయల చొప్పున పెరిగిపోయాయి. ఒకప్పుడు వరి పంటకు నెల్లూరు ధాన్యాగారం. నెల్లూరు పేరు కూడా నెల్లు (వడ్ల) నుంచే పుట్టింది. కానీ పది పదిహేనేళ్లుగా నెల్లూరీయులు ఇక్కడ పండే ధాన్యపు రకాలను తినడం లేదు. కర్నూలు, మిర్యాలగూడ, ఖమ్మం తదితర ప్రాంతాలలో పండే సన్నాలు, జిలకర మసూరి రకం బియ్యాన్ని తినడం అలవాటు చేసుకొన్నారు. ఈ సీజన్‌లో వ్యాపారులు పుట్టి ఏడువేల నుంచి పదివేల వరకు కొనుగోలు చేసిన ఈ రకం ధాన్యాన్ని వేల టన్నులు నెల్లూరు, దాని చుట్టుప్రక్కల గోడౌన్లలో నిల్వ చేశారు. దీనికి లెక్కాపక్కా, రికార్డు లేదు. వాస్తవానికి పది పుట్లకు మించి ధాన్యాన్ని నిల్వచేయను పౌరసరఫరాల శాఖ అనుమతి పొందాలి. ఈ శాఖలోని సివిల్ సప్లైస్ డిప్యూటీ తహశీల్దార్లు నిత్యం ధాన్యం నిల్వలపై తనిఖీలు చేస్తుండాలి. కానీ పేరుకు 16 మంది సిఎస్‌జిటిలు పనిచేస్తున్నా ఏ ఒక్కరూ తనిఖీలు చేసే సాహసం చేయడం లేదు. కారణం మిల్లర్లు, అక్రమంగా ధాన్యం నిల్వచేసే వారి వద్ద నెలసరి మామూళ్లు తీసుకోవడమే. జిలకర మసూరి రకం ధాన్యాన్ని అక్రమంగా నిల్వ చేయడం వల్ల నెల్లూరు మార్కెట్‌లో వీటి ధర గత నాలుగు నెలల వ్యవధిలో కిలో 26 రూపాయల నుంచి 36 రూపాయలకు చేరుకొంది. మిల్లర్లు పౌరసరఫరాల శాఖాధికారుల చెవుల్లో పూవులు పెడుతూ లెవీగా తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల నుంచి సేకరించిన రేషన్ బియ్యాన్ని రీ సైక్లింగ్ చేసి ఎఫ్‌సిఐకి ఇస్తున్నట్లు తెలిసింది. వారు సైతం మామూళ్ల మాయలో పడి వీటి నాణ్యత పరిశీలించడం లేదు. సన్న బియ్యాన్ని మిల్లర్లు లోకల్ మార్కెట్‌లో అధిక రేటుకు అమ్మి కోట్ల రూపాయలు గడించడంతోపాటు పడుగుపాడు నుంచి ఎగుమతి అర్డర్ల ద్వారా కేరళకు, విదేశాలకు పంపేస్తున్నట్లు తెలిసింది. అక్రమ నిల్వలపై పౌరసరఫరాల శాఖ కానీ విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ శాఖలు కానీ పరిశీలనలు, విచారణలు చేసి వ్యాపారులపై పిడియాక్ట్ కింద కేసులు నమోదు చేయవచ్చు. కానీ ఈ చర్యలే నెల్లూరులో లేకపోవడానికి బియ్యం అక్రమ నిల్వదార్లతో లాలూచీనే కారణమని చెప్పక తప్పదు. ఇటీవల కృష్ణపట్నం పోర్టు వద్ద 50 కోట్ల రూపాయలు విలువచేసే పామాయిల్ డాక్యుమెంట్లు లేకుండా రావడాన్ని విజిలెన్స్ అధికారులు గుర్తించినా, సరకు తెచ్చిన వాళ్లు తప్పించుకునే వీలున్నా 6ఎ నోటీసు ఇచ్చి సరిపెట్టినట్లు తెలిసింది. బియ్యం రేట్లు పెరిగాయని తక్కువ రేట్లకు రైతు బజార్లలో విక్రయిస్తామని చెప్పిన అధికారులు ఈ వారంలో ఆ సౌకర్యానికి మంగళం పాడేశారు. నెల్లూరు పౌరసరఫరాల శాఖ కార్యాలయంలో బియ్యం, ధాన్యం, నూనె నిల్వలకు సంబంధించిన రికార్డులు నగరంలోని మూడు రైసుమిల్లర్ల సంఘాల ప్రతినిధులే ఆ ఆఫీసులో ఉంటూ తమ వద్ద ఉంచుకొంటున్నారంటే ఆ శాఖ కార్యాలయం ఎంత అవినీతి ఊబిలో చిక్కుకపోయి ఉందో అట్నే అర్థం చేసుకోవచ్చు. జాయింట్ కలెక్టర్‌తోపాటు కలెక్టర్‌గారు సైతం నెల్లూరులో బియ్యం అక్రమ నిల్వల గోడౌన్లపై స్వయంగా దాడులు చేస్తేగానీ ఈ అక్రమ వ్యవహారాల గుట్టు బయటపడదు.

## రక్త పిశాచుల కోరలు పొడుగే!

### విచారణలో తేలుతున్న వాస్తవాలు



ఆలస్యంగా రికార్డుల దుమ్ము దులుపుతున్న బ్లడ్ బ్యాంక్ సిబ్బంది.



పెద్దాసుపత్రి బ్లడ్ బ్యాంక్ నుంచి రక్త నిల్వలు తరలించుకుపోతూ దొరికిన ఘటనలో పలు ఆసక్తికర విషయాలు వెలుగు చూస్తున్నట్లు సమాచారం. రాష్ట్రవ్యాప్తంగా రక్తాన్ని వ్యాపారంగా చేసుకొన్న ముఠా వ్యవహారం ఈ ఘటనతో వెలుగు చూస్తున్నట్లు తెలుస్తోంది. జిల్లాతోపాటు చుట్టుప్రక్కల జిల్లాల్లోనూ రక్త వ్యాపారం పెద్ద ఎత్తున జరుగుతున్నట్లు విశ్వసనీయ సమాచారం. చాలాకాలంగా గుట్టుచప్పుడు కాకుండా పెద్దాసుపత్రి నుంచి బ్లడ్ ప్యాకెట్‌లు అక్రమంగా తరలి పోతున్నాయని, వీటిని ఒక ముఠాగా ఏర్పడి పలు ఆస్పత్రులు, సిబ్బందితో సంబంధాలు పెట్టుకొని అధిక ధరలకు రక్తాన్ని అమ్ముతూ జేబులు నింపుకొంటున్నట్లు తెలుస్తోంది. బ్లడ్ బ్యాంక్ అధికారులు అలక్ష్యంగా వ్యవహరించడంతో ఇలాంటి అక్రమాలు జరుగుతున్నాయని తెలిసినా మనకెందుకులే అని పట్టించుకోకపోవడమో, లేక మరే కారణమో తెలీదు కానీ రక్తనిల్వలు తరలిపోతున్న విషయంపై దృష్టి సారించకపోవడంతో గత కొంతకాలంగా ఈ వ్యవహారం జరుగుతున్నట్లు తెలుస్తోంది. జిల్లాలోని వివిధ ప్రాంతాలతోపాటు నగరంలోని పలు హాస్పిటల్స్‌లో పనిచేసే సిబ్బందికి ఈ అక్రమార్కులతో సంబంధాలున్నాయనే ఆరోపణలు వినవస్తున్నాయి. పొగతోటలో సినిమా హాల్ ఎదురుగాగల హాస్పిటల్‌లో అన్నీతానై వ్యవహరించే ఒక ఉద్యోగి బ్లడ్ బ్యాంక్ నుంచి ఎప్పుడు కావాలంటే అప్పుడు రక్తాన్ని తెచ్చి రోగుల అవసరాన్ని బట్టి అధిక ధరలకు విక్రయిస్తున్నట్లు గగ్గోలు రేగుతోంది. ఇలాంటి వారు వివిధ ఆస్పత్రుల్లో ఉండి అక్రమంగా బ్లడ్ ప్యాకెట్లు తరలించే ముఠాతో సంబంధాలు పెట్టుకొని రక్త వ్యాపారాన్ని ఆదాయ వనరుగా మార్చుకొన్నట్లు సమాచారం. బ్లడ్ బ్యాంక్ నుంచి రక్తం తరలిస్తూ పట్టుబడ్డ నిందితులు ఇరువురిని పోలీస్ లోతుగా విచారించినట్లయితే మరింతగా విషయాలు వెలుగు చూస్తాయని పలువురు ఆశిస్తున్నారు.

## రైల్వేస్టేషన్‌లో మోత కూలీలు లేరు

- ఇబ్బంది పడుతున్న ప్రయాణీకులు



ఎవరి లగేజి వారు మోయాల్సిందే.

నెల్లూరు రైల్వే స్టేషన్ నుంచి హైదరాబాద్‌కు ప్రయాణం చేసే వారి వద్ద గానీ, అక్కడ నుంచి ఇక్కడకు వచ్చే వారి వద్ద గానీ దండిగా సామాను ఉంటుంది. కానీ రాత్రి పూట స్టేషన్‌లో సామాన్లు మోసే కూలీలు ఉండడం లేదు. దీంతో దూరాభారం నుంచి వచ్చేవాళ్లు సామానుతో స్టేషన్ బయటకు రాను నానాపాట్లు పడుతున్నారు. ఒంటరిగా సామాన్లతో రైలు దిగిన మహిళల పరిస్థితి వర్ణనాతీతంగా ఉంది. ఎవరి సామాన్లు వారు మోసుకెళ్లే క్రమంలో కొన్నిసార్లు రైళ్లు కూడా మిస్ అవుతున్నాయి. ఏదో విధంగా స్టేషన్ నుంచి బయటకు వచ్చే ప్రయాణీకులను ఆటోల వాళ్లు నిలువు దోపిడీ చేస్తున్నారు. గాంధీ బొమ్మ వరకు వంద, ఆర్టీసికి 120 రూపాయలు, వేదాయపాళెంకు 150 రూపాయలు అడుగుతున్నారు. గతంలో రైల్వేస్టేషన్ బయట ఉండే పోలీస్ అవుట్ పోస్ట్‌లోని సిబ్బంది ఆటోవాళ్ల ఆగడాలను కొంతమేర అదుపు చేసేవారు. ప్రస్తుతం ఈ పరిస్థితి లేకపోవడం వల్ల ఇబ్బంది పడాల్సి వస్తుంది. కూలీల వ్యవహారంలో స్టేషన్ మాస్టర్, ఆటో వాళ్లను అదుపు చేయను పోలీస్ యంత్రాంగం ప్రయత్నించాల్సి ఉంది.

## రేషన్ కార్డుల తనిఖీ! ఫలితముండేనా?

నగరంలో పౌరసరఫరాల శాఖ అధికారులు రేషన్ షాపుల తనిఖీలకు శ్రీకారం చుట్టారు. ప్రజా పంపిణీ వ్యవస్థను మరింత పటిష్టంగా అమలు చేయాలన్న లక్ష్యంతో అధికారులు బృందాలుగా ఏర్పడి తనిఖీలు చేస్తున్నారు. రేషన్ షాపుల్లో సక్రమంగా సరుకులు పంపిణీ జరగడం లేదంటూ ఫిర్యాదులు అందుతున్నాయి. వచ్చిన ఫిర్యాదులను పరిశీలించాలని తహశీల్దార్ కార్యాలయాలకు పంపిస్తుంటారు. దీంతో రెవిన్యూ అధికారులు రేషన్‌షాపు డీలర్లతో కుమ్మక్కై అక్రమాలకు పాల్పడిన వారిపై ఎటువంటి చర్యలు తీసుకోవడం లేదన్న ఆరోపణలు ఉన్నాయి. ఈ నేపథ్యంలో పౌరసరఫరాల శాఖ అధికారులే నేరుగా రేషన్ షాపులు తనిఖీ చేయాలని నిర్ణయించారు. ఇటీవల నెల్లూరు నగరంలోని 42, 51 నెంబర్ రేషన్ షాపులను అధికారులు తనిఖీ చేసిన సమయంలో బియ్యం, ఇతర సరుకుల నిల్వలకు, పంపిణీ చేసిన వాటికి సంబంధించి చాలా వ్యత్యాసం ఉన్నట్లు గుర్తించారు. స్టాకు రిజిష్టర్ కూడా సక్రమంగా నిర్వహించకపోవడంపై అధికారులు కొంత జరిమానా విధించారు. జిల్లా వ్యాప్తంగా అన్ని రేషన్ షాపులను త్వరలో తనిఖీ చేయనున్నట్లు పౌరసరఫరాల శాఖ అధికారి ఉమామహేశ్వరావు చెప్పారు.

## ఇరుగాళమ్మ హుండీ లెక్కింపు!

- ముడుపులు బాగానే చెల్లిస్తున్న భక్తులు

నెల్లూరు గ్రామదేవత ఇరుగాళమ్మ దేవస్థానంలో పెట్టి ఉన్న హుండీలను రెండు నెలల పదిహేను రోజుల అనంతరం 6వ తేది లెక్కించగా మూడు లక్షల ముప్పై ఏడు వేల అయిదు వందల పన్నెండు రూపాయలు ఉన్నట్లు తేలింది. ఈ లెక్కింపును దేవాదాయ శాఖ ఇన్స్‌పెక్టర్ పి.శైలేంద్రకుమార్, దేవస్థానం ఛైర్మన్ సూరిశెట్టి నరేంద్ర, ధర్మకర్తల మండలి సభ్యులు పేట మాధవయ్య ఆచారి, రావూరి కృష్ణసుధ తదితరులు పర్యవేక్షించారని దేవస్థానం కార్యనిర్వహణాధికారి ఎ.వి.శ్రీనివాసులురెడ్డి చెప్పారు.

# అభివృద్ధి పథంలో నెల్లూరు నగరపాలక సంస్థ











## అభివృద్ధి కార్యక్రమాలు

**కార్పొరేషన్ సాధారణ నిధుల నుండి :**

- రూ. 17.58 కోట్లతో రహదారుల నిర్మాణం
- రూ. 5.97 కోట్లతో డ్రైన్ల నిర్మాణం
- రూ.135 లక్షలతో పైపులైన్ల నిర్మాణం
- రూ. 11.00 కోట్లతో సిసి రోడ్లు మరియు డ్రైన్ల నిర్మాణం
- రూ. 11.45 కోట్లతో రోడ్లు మరియు డ్రైన్ల పనులు జరుగుచున్నవి.
- రూ. 28.00 లక్షలతో గవర్నమెంట్ హాస్పిటల్ నుండి కరెంట్ ఆఫీస్ సెంటర్ వరకు సెంట్రల్ లైటింగ్ ఏర్పాటు చేయడమైనది.
- రూ. 19.00 లక్షలతో గాంధీనగర్ రిజర్వాయర్ నుండి ఆటోనగర్ వరకు పైపులైను వేయడం జరిగింది.

**12వ ఆర్థిక సంఘ నిధులతో :**

- రూ. 996.00 లక్షలతో పనులు పూర్తి చేయడం జరిగింది.

**13వ ఆర్థిక సంఘ నిధులతో :**

2010 - 11 సంవత్సరమునకు చేపట్టిన పనులు :

- మురికి కాలువల నిర్మాణమునకు రూ. 179.80 లక్షలు
- మంచినీటి సరఫరా పైపులైన్లు వేయుటకు రూ. 66.00 లక్షలు
- క్రొత్త మోటార్లు కొనుగోలు చేయుటకు రూ. 58.00 లక్షలు
- సెంట్రల్ లైటింగ్ ఏర్పాటు చేయుటకు రూ. 35.00 లక్షలు

**2011 - 12 సంవత్సరమునకు చేపట్టిన పనులు :**

- మురికి కాలువల నిర్మాణమునకు రూ. 108.05 లక్షలు
- మంచినీటి సరఫరా పైపులైన్లు వేయుటకు 255.50 లక్షలు
- క్రొత్త మోటార్లు కొనుగోలు చేయుటకు రూ. 61.50 లక్షలు
- సెంట్రల్ లైటింగ్ ఏర్పాటు చేయుటకు రూ. 54.00 లక్షలు
- జనరేటర్ కొనుగోలు చేయుటకు రూ. 30.00 లక్షలు

**2012 - 13 సంవత్సరమునకు చేపట్టిన పనులు :**

- మురికి కాలువల నిర్మాణమునకు రూ. 395.00 లక్షలు
- మంచినీటి సరఫరా పైపులైన్లు వేయుటకు రూ. 202.17 లక్షలు
- క్రొత్త మోటార్లు కొనుగోలు చేయుటకు రూ. 10.00 లక్షలు
- సెంట్రల్ లైటింగ్ ఏర్పాటు చేయుటకు రూ. 77.00 లక్షలు
- జనరేటర్ కొనుగోలు చేయుటకు రూ. 72.00 లక్షలు
- కార్పొరేషన్ ఆఫీసు నూతన భవన నిర్మాణం రూ. 1000 లక్షలు
- జాతీయ రహదారితో నెల్లూరు నగరమును అనుసంధానము చేయు లింకు రోడ్డు నిర్మాణానికి రూ. 1847.56 లక్షలతో 8 పనులు చేపట్టి, 5 పనులు పూర్తి చేయుట జరిగినది. 3 పనులు జరుగుచున్నవి.
- రూ. 120.00 లక్షలతో డైకస్‌రోడ్డులోని చేపల మార్కెట్ ఆధునీకరణ చేయటం జరిగినది.
- నెల్లూరులో లైలా తుఫాను వలన దెబ్బతిన్న రోడ్లు,డ్రైన్లు మరియు పైపులైను పున: నిర్మాణం చేయుటకు రూ. 619.00 లక్షలతో పనులు పూర్తి చేయుట జరిగినది.

**ఎ.యస్.సి గ్రాంటు 10-11**

- 185 లక్షలతో 625 కె.వి.ఎ జనరేటర్స్‌ను హెడ్ వాటర్ వర్క్స్ వద్ద ఏర్పాటు చేయడం మరియు ట్యాంకర్స్ ద్వారా మంచినీరు సరఫరా చేయుటకు

**షాపింగ్ కాంప్లెక్స్‌లు :**

- రూ. 55.00 లక్షలతో డైకస్‌రోడ్డులోని చేపల మార్కెట్ ముందు షాపింగ్ కాంప్లెక్స్‌నిర్మాణము పూర్తి చేయడం జరిగినది.
- రూ. 55.00 లక్షలతో ఎసి మార్కెట్, చిన్నబజారు మొదటి అంతస్తు నిర్మాణము పూర్తి చేయడం జరిగినది.
- రూ. 13.50 లక్షలతో వెంగళరావు నగర్‌లో షాపింగ్ కాంప్లెక్స్ నిర్మాణము పూర్తి చేయడం జరిగినది.
- రూ. 27.00 లక్షలతో స్టోన్‌హౌస్‌పేటలోని కన్యకాపరమేశ్వరి దేవస్థానం వద్ద షాపింగ్ కాంప్లెక్స్ నిర్మాణం చేపట్టడం జరిగినది.

**సిటిజన్ రిసోర్స్ సెంటర్స్ :**

- రూ. 35 లక్షలతో వెంగళరావు నగర్, రిత్విక్ లేఅవుట్, ముత్యాలపాళెం, బంగళాతోట నందు సిటిజన్ రిసోర్స్ సెంటర్స్ నిర్మాణము పూర్తి చేయడం జరిగినది.

**మునిసిపల్ రిజర్వు స్థలమునకు ప్రహరీ గోడ నిర్మాణము :**

- రూ. 25 లక్షలతో గాంధీనగర్, ఆదిత్యనగర్ మరియు వెంగళరావునగర్ లందు పనులు జరుగుచున్నవి.
- రూ. 25 లక్షలతో ముత్యాలపాళెం, లెక్చరర్స్ కాలనీ, రుత్విక్ లేఅవుట్‌ల యందు పనులు జరుగుచున్నవి.
- నగరములో గత సంవత్సరమునకు కురిసిన వర్షాలకు దెబ్బతిన్న రోడ్లు, డ్రైన్లు పున: నిర్మించుటకు రూ. 100.00 లక్షలతో పనులు త్వరలో ప్రారంభించుట జరుగుతుంది.

**మెయింట్‌నెన్స్ ఆఫ్ ఇంటర్నల్ రోడ్స్ నిధుల ద్వారా రూ. 1454.60 లక్షలతో క్రింది పనులు చేపట్టి పూర్తి చేయుట జరిగినది.**

- రూ. 350.00 లక్షలతో రైల్వేస్టేషన్ నుండి సిపిఐ ఆఫీసు వరకు సిమెంట్ రోడ్డు, డ్రైను, సెంట్రల్ లైటింగ్ ఏర్పాటు చేయుట.
- రూ. 205.00 లక్షలతో కృష్ణపట్నం రోడ్డు నుండి రాజుపాళెం రోడ్డు వరకు ఎల్ఐసి కాలనీ మీదుగా బిటి రోడ్డు నిర్మించుట.
- రూ. 79.00 లక్షలతో ఎన్.హెచ్ - 5 నుండి రాజుపాళెం రోడ్డు వరకు సిసి రోడ్డు నిర్మాణం.
- రూ. 40.00 లక్షలతో జిటిరోడ్డు నుండి వేదాయపాళెం రైల్వేస్టేషన్ వరకు సిసిరోడ్డు నిర్మాణం.
- రూ. 178.00 లక్షలతో స్టోన్‌హౌస్‌పేట మెయిన్ రోడ్డుకు సిసి రోడ్డు నిర్మించుట.
- రూ. 154.00 లక్షలతో మినీబైపాస్ రోడ్డు నుండి ముత్యాలపాళెం రోడ్డుకు సిసి రోడ్డు నిర్మాణం.
- రూ. 85.00 లక్షలతో మినీబైపాస్ రోడ్డు నుండి బ్యాంక్ కాలనీ రోడ్డుకు బిటిరోడ్డు నిర్మాణం.
- రూ. 90.00 లక్షలతో ఎన్టీఆర్‌నగర్ మెయిన్‌రోడ్డుకు సిసిరోడ్డు మరియు డ్రైన్ నిర్మాణం.
- రూ. 94.00 లక్షలతో మాగుంట అండర్ బ్రిడ్జి నుండి అరవిందనగర్ రైల్వే కల్వర్ట్ వరకు బిటి రోడ్డు.
- రూ. 15.60 లక్షలతో రాజీవ్ గాంధీ కాలువ కట్ట మరియు సర్వేపల్లి కాలువకట్ట వద్ద సిసి రోడ్డు నిర్మాణం
- రూ. 14.00 లక్షలతో హరనాధపురంలో సిసి లింకు రోడ్డు నిర్మాణం.
- రూ. 40.00 లక్షలతో మినీబైపాస్ రోడ్డు నుండి కెఎన్ఆర్ స్కూల్ వరకు లెప్రసీ ఆసుపత్రి మీదుగా సిసి రోడ్డు నిర్మించుట.
- రూ. 14.50 లక్షలతో రాంజీనగర్ 8వ వీధిలో సిసి రోడ్డు నిర్మించుట
- రూ. 60.00 లక్షలతో మినీబైపాస్‌రోడ్డు నుండి మాగుంట లేఅవుట్‌లో బిటి రోడ్డు నిర్మించుట.
- రూ. 35.50 లక్షలతో శ్రీవారి అపార్ట్‌మెంట్ వద్ద గల రిజర్వు స్థలమును అభివృద్ధి పరుచుట

**ఏ.సి.డి.పి :**

- రూ. 99.82 లక్షలతో 27 పనులు పూర్తి చేయడం జరిగినది.

**యం.పి ల్యాడ్స్ :**

- రూ. 16.00 లక్షలతో రిత్విక్ లే అవుట్ నందు సిసి రోడ్డు వేయడం జరిగినది.

**జంక్షన్ అభివృద్ధి చేయుట:**

- రూ. 18.00 లక్షలతో పొదలకూరు రోడ్డులో ప్రభుత్వ ఆసుపత్రి కూడలి వద్ద.
  రూ. 31.00 లక్షలతో కరెంట్ ఆఫీస్ సెంటర్ వద్ద ట్రాఫిక్ ఐ లాండ్ ఏర్పాటు చేయుట
- రూ. 10.50 లక్షలతో వేదాయపాళెం సెంటర్ వద్ద ట్రాఫిక్ ఐలాండ్ ఏర్పాటు చేయుట

**ఎన్.ఎఫ్.డి.బి ఫండ్స్ సహాయముతో :**

భారతదేశంలోనే మొట్టమొదటి సారిగా :

- ఆధునిక చేపల మార్కెట్ నిర్మాణము రూ. 120 లక్షలతో డైకస్‌రోడ్డులో నిర్మించడం జరిగింది.
- నెల్లూరు మైపాడు రోడ్డు నందు రెండవ చేపల మార్కెట్ రూ. 100 లక్షలతో నిర్మాణం చేపట్టడం జరుగుతుంది.
- డైకస్‌రోడ్డులోని చేపల మార్కెట్‌లో మొదటి అంతస్థు నిర్మాణము మరియు హోల్‌సేల్ ప్లాట్‌ఫారమ్స్ రూ. 70 లక్షలతో నిర్మాణం.

**డా॥ టీ.ఎస్.ఆర్. అంజనేయులు**
కమిషనర్





## నగరపాలక సంస్థ, నెల్లూరు.

# పని చేయని కాంట్రాక్టర్లను బ్లాక్ లిస్ట్‌లో పెట్టండి!



● కావలిలో మునిసిపల్ మంత్రి ఆదేశం

వర్క్ ఆర్డర్లు పొంది పని చేయని కాంట్రాక్టర్లను బ్లాక్ లిస్టులో పెట్టాలని మునిసిపల్ మంత్రి మానుగుంట మహీధర్‌రెడ్డి ఆదేశించారు. కావలి వచ్చిన ఆయన మునిసిపల్ కార్యాలయాన్ని సందర్శించారు. అనంతరం స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావుతో కలిసి అధికారులతో సమీక్ష జరిపారు. ఈ సందర్భంగా వివిధ నిర్మాణ పనులు ఆలస్యం కావడం, కొన్ని ప్రారంభం కాకపోవడంపై ఆగ్రహం వ్యక్తం చేశారు. కాంట్రాక్టు దక్కించుకొని పనులు చేయకుండా జాప్యం చేసే కాంట్రాక్టర్లను బ్లాక్‌లిస్టులో పెట్టాలన్నారు. సమ్మర్ స్టోరేజ్ ట్యాంకు విషయమై మాట్లాడుతూ నెలరోజుల్లో ఈ ట్యాంకు నిర్మాణాన్ని పూర్తి చేయాలన్నారు. ప్రభుత్వ నిబంధనలు పాటించకుండా ఇష్టానుసారంగా నిర్మాణాలు చేపట్టడంపై వచ్చిన ఫిర్యాదులపై ఆయన స్పందిస్తూ అలాంటి వారిపై చర్యలు చేపట్టాలని అధికారులను ఆదేశించారు. మునిసిపల్ కూరగాయల మార్కెట్ నిర్మాణానికి 2కోట్ల రూపాయలు మంజూరు చేశామని, మాంసం, చేపల మార్కెట్ నిర్మాణానికి 2.50 కోట్లతో ప్రతిపాదనలు పంపామన్నారు. పన్ను చెల్లించని మొండి బకాయిదారులను గుర్తించి వారి ఇంటి గోడలపై ఆ వివరాలన్నింటిని వ్రాయాలన్నారు. కంపోస్టుయార్డును మరో ప్రాంతానికి తరలించడంతోపాటు, బాలకృష్ణారెడ్డినగర్‌కు మునిసిపాల్టీ నుంచి మంచినీటిని అందించాలన్నారు. మొక్కలు నాటే కార్యక్రమానికి అధికారులు శ్రీకారం చుట్టాలని కోరారు. ఈ సమావేశంలో మునిసిపల్ గుంటూరు రీజినల్ డైరెక్టర్ శ్రీనివాసరావు, మెప్మా పిడి కమలకుమారి, మునిసిపల్ ప్రత్యేకాధికారి సుబ్రహ్మణ్యేశ్వర రెడ్డి, కమిషనర్ నిరంజన్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.



శ్రీహరికోటకు వచ్చిన ప్రధాని మన్మోహన్‌సింగ్‌కు స్వాగతం పలుకుతున్న గవర్నర్ నరసింహన్, ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి.



శ్రీహరికోటలో గవర్నర్, ముఖ్యమంత్రులను స్వాగతిస్తున్న షార్ డైరెక్టర్ దత్తన్. చిత్రంలో జిల్లా ఇన్‌ఛార్జి మంత్రి పితాని సత్యనారాయణ, ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి.

# కలుషిత జలాలతో పంట నష్టం!

## కృష్ణపట్నంలో రైతుల లబోదిబో

ముత్తుకూరు మండలం పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్నా మరోవైపు కాలుష్యం పలు రకాలుగా ఇబ్బంది పెడుతోంది. వివిధ థర్మల్ ప్రాజెక్టుల ఏర్పాటు వలన పర్యావరణ కాలుష్యం ఏర్పడుతుందని శాస్త్రవేత్తలు ఘోషించినా ఫలితం లేకుండాపోయింది. దీనివలన ఎలాంటి దుష్ప్రభావాలు వుంటాయో పంటలను పరిశీలిస్తే తెలుస్తుంది. కృష్ణపట్నం పోర్టు పరిసర ప్రాంతాలలో వున్న ఫ్యాక్టరీల నుంచి వచ్చే కలుషిత వ్యర్థ జలాల కారణంగా పంటపొలాలు దెబ్బతింటున్నాయి. పామాయిల్ ఫ్యాక్టరీల నుంచి వచ్చే కలుషిత నీరు ఆ చుట్టుప్రక్కల ప్రాంతాలలోని వేరుశనగ పంటను తీవ్రంగా నష్టపరుస్తోంది. దుర్వాసన, రంగుమారిన ఈ నీటి వలన పంటలు దెబ్బతినడంతోపాటు భూగర్భ జలాలు కలుషితమవుతున్నాయని ఈ ప్రాంత ప్రజలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. అధికారులు పరిశీలించి ఫ్యాక్టరీల నుంచి వచ్చే వ్యర్థ జలాల వలన పంటనష్టం కలుగకుండా చూడాలని, కాలుష్యనియంత్రణ మండలి తగిన చర్యలు చేపట్టాలని ఈ ప్రాంతీయులు కోరుతున్నారు.

# మాకే కాంట్రాక్ట్ లివ్వండి - మా వారికే ఉద్యోగాలివ్వండి!

రాజకీయ నేతల పైరవీలతో ముత్తుకూరు మండలంలోని వివిధ కంపెనీల వారికి ఇబ్బందులు ఎదురౌతున్నాయి. అధికారపార్టీ నేతలు ఒకవైపు, ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీ నేతలు మరొకవైపు తమవారికి ఉద్యోగాలు ఇప్పించుకొనేందుకు, ఉపాధి చూపించేందుకు కంపెనీలపై ఒత్తిడి తెస్తుండడంతో తలలు పట్టుకొంటున్నారు ఆయా కంపెనీల ప్రతినిధులు. మండలం

## ముత్తుకూరులో తలలు పట్టుకొంటున్న పారిశ్రామికులు

పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతుండడం, జెన్‌కో తదితర కంపెనీలు ఏర్పడుతుండడంతో స్థానిక యువత ఉపాధి, ఉద్యోగాల కోసం ఆశపడుతున్నారు. రాజకీయ జోక్యంతో అర్హులైన వారికి కాకుండా నేతలు చెప్పిన వారికి, పలుకుబడి కలిగిన వారికి ఉద్యోగాలు దొరుకుతుండడంతో అన్ని అర్హతలు వున్న వారు వెనుకబడిపోతున్నారు. వీటితోపాటు తమ యంత్రాలను, వాహనాలను పనిలో పెట్టుకోవాలని డిమాండ్ చేస్తుండంతో కాదంటే ఏమో, ఔనంటే ఏమోననీ కంపెనీల నిర్వాహకులు నలిగిపోతున్నారు.

# దారి తప్పుతున్న విద్యార్థులు!

చదువుకోవాల్సిన వయసులో ఆకర్షణకు లోనై అది ప్రేమ, వ్యామోహమో తెలియక జీవితాలను నాశనం చేసుకొనేవారి సంఖ్య నానాటికి అధికమవుతోంది. పదవతరగతి, ఇంటర్ చదివే పిల్లలు ప్రేమ పేరుతో పక్కదారిపడుతుండగా, వారి తల్లిదండ్రులు అల్లాడుతున్నారు. దీనికి ఉదాహరణ కలువాయి మండలంలో ఇటీవల జరిగిన పరిణామాలే. కలువాయి కేంద్రంగా ఏర్పాటై వున్న పాఠశాలలు, కళాశాలల్లో చదువుతున్న విద్యార్థులు తమ చదువులకు గుడ్‌బై చెప్పి ప్రేమ వ్యవహారాల్లో మునిగి తేలుతూ చిన్న వయసులోనే శారీరక సంబంధాలు పెట్టుకొని తలవంపులు తెస్తున్నారు. ఇక్కడి ఉన్నతపాఠశాలలో పదవతరగతి

## కలువాయిలో గగ్గోలు

చదివే ఒక విద్యార్థిని ఆరు నెలల గర్భవతిగా వెలుగులోకి రావడం తీవ్ర చర్చనీయాంశమయ్యింది. ఇది ఆనోట ఈనోట పడి ప్రచారం కావడంతో ఆ విద్యార్థిని తల్లిదండ్రులు దూరంగా తీసుకెళ్లి అబార్షన్ చేయించినట్లు తెలిసింది. అలాగే ఇక్కడి కళాశాలలో ఇంటర్ చదువుతున్న అమ్మాయి, అబ్బాయి తమ తల్లిదండ్రుల కన్నుగప్పి పారిపోయారు. వీరిరువురు ఊరు వదలి పోవడం, మైనార్టీ తీరకపోవడంతో అమ్మాయి తల్లిదండ్రులు కలువాయి పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేశారు. పోలీసులు గాలించి ఇరువురిని పట్టుకొని వచ్చి అమ్మాయిని వారి పెద్దలకు అప్పగించి, అబ్బాయి వారి తల్లిదండ్రులు, బంధువులపై కేసులు పెట్టి అరెస్టు చేయడం సంచలనం రేపింది. వీటన్నింటికి కారణం సెల్‌ఫోన్‌లేనన్నది పలువురు వ్యక్తం చేస్తున్న అభిప్రాయం. మరోవైపు తల్లిదండ్రులు తమ పిల్లల ప్రవర్తన గురించి పట్టించుకోకపోవడం ఇలాంటి వాటికి కారణమవుతోంది.

# కావలిలో అక్రమార్కులు!

## కాలువ స్థలం ఆక్రమణకు యత్నం

కావలి పట్టణ ఉత్తర శివార్లలోని డంప్ యార్డుకు ఎదురుగా వున్న పంటకాలువ ఆక్రమణకు గురైంది. కొందరు వ్యక్తులు ఒక పథకం ప్రకారం కొంతకాలంగా ఈ స్థలాన్ని ఆక్రమించేందుకు యత్నిస్తున్నారు. అందులో భాగంగా మట్టి, రబ్బీష్ తెచ్చి మెల్లమెల్లగా కాలువను ఆక్రమించేస్తున్నారు. బహిరంగంగా పంటకాలువను ఆక్రమించేయత్నం చేస్తున్నా సంబంధిత అధికారులు పట్టించుకోకపోవడం విమర్శల పాలవుతుంది. అసలే పంటకాలువలు పూడిపోయి వ్యవసాయానికి నీరందక రైతులు ఇబ్బందిపడుతున్న పరిస్థితుల్లో కాలువను యథేచ్ఛగా ఆక్రమిస్తున్న అధికారులు పట్టించుకోవడం లేదని రైతు కూలీసంఘం అధ్యక్షుడు మాల్యాద్రి విమర్శించారు. తక్షణం ఆక్రమణలు తొలగించి ప్రభుత్వ స్థలాన్ని రక్షించాలని డిమాండ్ చేశారు.

# టీకాలు జాగ్రత్తగా వేయాలి!

## వైద్య సిబ్బందికి టీకాల అధికారి హెచ్చరిక

పిల్లలకు మెదడువాపు టీకాలు వేయడంలో నిర్లక్ష్యం ప్రదర్శించినా, ఎక్కడైనా కేసులు నమోదైనా వైద్యసిబ్బందిపై చర్యలు తప్పవని జిల్లా ఇమ్యూనైజేషన్ అధికారి జయసింహ హెచ్చరించారు. ఇటీవల ఆయన సీతారాంపురంలోని ఆరోగ్య కేంద్రాన్ని తనిఖీ చేసి వ్యాధి నిరోధక టీకాలపై ఆరా తీశారు. మెదడువాపు టీకాలు నిల్వలు, రికార్డుల్లోని వివరాలతో సరిపోకపోవడంపై ఆగ్రహం వ్యక్తం చేశారు. పిహెచ్‌సి పరిధిలో 38 మంది చిన్నారులను లక్ష్యంగా చేసుకొని టీకాలు వేయాల్సి వుండగా సెప్టెంబర్ నెల వచ్చినా ఒక్క టీకా వేయకపోవడంపై వైద్యాధికారులు, సిబ్బందిపై మండిపడిన ఆయన నిర్లక్ష్యంపై డిఎంహెచ్‌ఓ దృష్టికి తీసుకొనిపోయి చర్యలకు సిఫార్సు చేస్తామన్నారు. సీతారామపురం మండలం మెదడువాపు వ్యాధికి సమస్యాత్మక ప్రాంతమైనందున ప్రత్యేక కార్యక్రమాన్ని ఏర్పాటుచేసి చిన్నారులకు టీకాలు వేయాలన్నారు. అలాగే పిహెచ్‌సిలలో నెలకు 25 కాన్పులు జరిగేలా సిబ్బంది చొరవ చూపాలన్నారు. అనంతరం మారం రెడ్డిపల్లి అరుంధతీయవాడలో వ్యాక్సినేషన్‌ను తనిఖీ చేశారు. అక్కడ వ్యాక్సినేషన్ నిర్వహించకపోవడంపై ఎఎన్‌ఎంకు మెమో ఇవ్వాలని వైద్యాధికారిని ఆదేశించారు. హెచ్‌డిఎస్ నిధులతో రెఫ్రిజిరేటర్లకు ఇన్వర్టర్ సౌకర్యాన్ని కల్పించనున్నట్లు తెలిపారు. ఈ కార్యక్రమంలో ఆరోగ్య విస్తరణాధికారి వెంగయ్య, ఆరోగ్య పర్యవేక్షకులు నజీర్‌బాషా తదితరులు పాల్గొన్నారు.



నెల్లూరీయుడు, చెన్నైలో పేరుగాంచిన సర్జన్ డాక్టర్ సివిఎంకె.రెడ్డి వృత్తిపరంగా చేసిన సేవలకుగాను నార్త్ అమెరికాలోని చికాగోలో జిఎంసిఏఎన్ఏ సంఘం సెప్టెంబర్ 1తేది సన్మానించిన దృశ్యం.



నెల్లూరులో గతంలో ఎస్పీగా పని చేసి ఇటీవలే సిబిఐ డిఐజిగా నియమితులైన దామోదర్‌ను హైదరాబాద్‌లోని దశపల్లా హోటల్‌లో సన్మానిస్తున్న కిమ్స్ హాస్పిటల్ ఆర్థో సర్జన్ డాక్టర్ కె.కృష్ణయ్య, గుమ్మడి కృష్ణంరాజు, బివి.నరసింహం.



నెల్లూరుజిల్లా కమ్మ జన సంక్షేమ సమితి ఆధ్వర్యంలో ప్రతిభావంతులైన పిల్లలకు స్కాలర్ షిప్పులు ప్రదానం చేస్తున్న కాకతీయ సేవా సమితి అధ్యక్షుడు రావి మోహన్‌చౌదరి. ప్రక్కన వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ, గూటూరు కన్నబాబు, బెజవాడ వెంకట్రావు.



నెల్లూరు కొండాయపాళెం గేటు వద్ద గల బాలుర హాస్టల్‌లో కనీస సౌకర్యాల కల్పనలో భాగంగా స్వంత నిధులు వెచ్చించడంతో పాటు శ్రమదానం చేస్తున్న వైకాపా నాయకుడు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి.

# అనర్హులకు ఇందిరమ్మ ఇళ్లు!

## వెంకటగిరి ఎమ్మెల్యేనే కారకుడని ఆరోపణలు

ఎస్సీ, ఎస్టీ మైనార్టీల కోసం ప్రభుత్వం నిర్మిస్తున్న ఇందిరమ్మ ఇళ్లు అర్హులకు కాకుండా ప్రజా ప్రతినిధులు సిఫార్సు చేసిన వారికి అందుతున్నాయని కలువాయి మండలంలో గగ్గోలు రేగుతోంది. ఇందిరమ్మ ఇళ్లలో పేద ప్రజలకు అన్యాయం జరుగుతోందని; ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ చెప్పిన వారికే ఇవి దక్కుతున్నాయనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. కలువాయి మండలంలో జరిగిన రచ్చబండ కార్యక్రమంలో ఇందిరమ్మ ఇళ్ల కోసం వచ్చిన దరఖాస్తుల్లో 279 మందిని అర్హులుగా గుర్తించారు. వీరిలో 44 మందికి ఇళ్లు మంజూరయ్యాయి. ఎమ్మెల్యే అర్హులైన పేదలను ప్రక్కనబెట్టి తోపుగుంట, చింతలాత్మకూరు, వెదనపర్తి, చవటమల్లి గ్రామాల్లో అర్హతలేని వారికి, తన సామాజిక వర్గం వారికి ఇళ్లు కేటాయించేలా చేశారని టిడిపి నాయకులు బాహాటంగా ఆరోపిస్తున్నారు. బేస్‌మట్టాలు పూర్తి చేసుకొని పేదలు ప్రభుత్వ అనుమతికోసం ఎదురు చూస్తుండగా, బేస్‌మెంట్ లెవల్ పూర్తి చేసుకోని వారికి, సొంత ఇళ్లు కల్గిన అనర్హులకు ఇళ్లు మంజూరు చేయడంపై ఎఇ శ్రీనివాసులరెడ్డిని ప్రశ్నిస్తే చింతలాత్మకూరులో ఎమ్మెల్యే సిఫార్సు, వెదనపర్తిలో ఎమ్మెల్యే పిఏ సిఫార్సు అంటూ చెబుతున్నాడని మండల నేతలు ఆగ్రహిస్తున్నారు. ఇప్పటికైనా ఉన్నతాధికారులు జోక్యం చేసుకొని ఇళ్ల మంజూరులో అవకతవకలను చక్కదిద్ది అర్హులైన పేదలకు ఇవ్వాలని పలువురు కోరుకొంటున్నారు.

# రూ.10 కోట్లతో నీటి శుద్ధి పథకాలు!

## ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి ప్రకటన

ఫ్లోరోసిస్ పీడిత గ్రామాల్లో 10కోట్ల రూపాయలతో నీటిశుద్ధి చేసే పథకాలను ఏర్పాటు చేసేందుకు కృషి చేస్తామని ఉదయగిరి శాసనసభ్యుడు మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి హామీ ఇచ్చారు. కొండాపురం మండలంలో పర్యటించిన ఆయన ఫ్లోరోసిస్ వ్యాధికి గురై మరణించిన కుటుంబాల వారిని పరామర్శించారు. ఈ సందర్భంగా ఆయన అక్కడి ప్రజలతో మాట్లాడి సమస్యలను తెలుసుకొన్నారు. తన సోదరుడైన పార్లమెంటు సభ్యుడు మేకపాటి రాజామోహన్‌రెడ్డి స్వంత నిధుల నుంచి ఐదు కోట్లు, ప్రభుత్వం నుంచి మరో ఐదు కోట్లు వెచ్చించి గ్రామాల్లో నీటి శుద్ధి పథకాలను ఏర్పాటు చేయనున్నట్లు తెలిపారు. ఈ కార్యక్రమంలో తహశీల్దార్ లావణ్య, ఎంపిడిఓ రమేష్, వైద్యాధికారులు మధుసూధన్, మాజీ ఎంపిపి మాధవరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

### నివారణే మార్గం

ఫ్లోరోసిస్‌కు మందులేదని, నివారణే మార్గమని వైద్యశాఖ జాయింట్ డైరెక్టర్ వీణాకుమారి తెలిపారు. కొండాపురంలో గల ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో జరిగిన జాతీయ ఫ్లోరోసిస్ అవగాహన సదస్సులో ఆమె పాల్గొన్నారు. ఫ్లోరోసిస్ పీడిత ప్రాంతాల్లో వైద్యాధికారులు తరచూ పర్యటించాలని, వైద్యశిబిరాలు ఆరోగ్య అవగాహన సదస్సులు నిర్వహించి ప్రజల్లో చైతన్యం తేవాలన్నారు. ప్రభుత్వం ఆయా ప్రాంతాల్లో తాగునీటి శుద్ధికి చర్యలు చేపడుతున్నట్లు తెలిపారు.

## అడవి రాజుపాలెంలో భయం... భయం!

### గ్రామం మొగుదాలలో క్షుద్రపూజ!

కావలి రూరల్ మండలం అడవిరాజుపాలెం గ్రామ శివార్లలోక్షుద్రపూజలుచేసిన ఆనవాళ్లు కన్పించడంపై ప్రజల్లో భయాందోళనలు వ్యక్తమవుతున్నాయి. తెల్లవారు జామున బహిర్భూమికి వెళ్లిన గ్రామస్తుల కంట క్షుద్రపూజలు చేసిన దృశ్యం కన్పించడం కలకలం రేపింది. పెద్ద ముగ్గుపెట్టి వుండడం, మిరపకాయలు, బొగ్గులు, మట్టితో చేసిన బొమ్మకు మేకులు గుచ్చి వుండడం, రక్తం, కోడిని మెడకోసి వుండడం చూసిన గ్రామస్తులు ఈ విషయాన్ని గ్రామ పెద్దలకు తెలియజెప్పడంతో ఈ వార్త చుట్టుప్రక్కల ప్రాంతాలకు పాకింది. క్షుద్ర పూజలు జరిగాయన్న అనుమానం బలపడడంతో గ్రామంలోని వారు హడలిపోతున్నారు. స్థానిక పోలీసులు దీనిపై విచారించి, ఒక వ్యక్తి తన కుమారుడి ఆరోగ్యం కోసం ఈ పూజలు చేశాడని తేలిందని ప్రజలు భయపడాల్సిన అవసరం ఏమీలేదన్నారు.

# భూవివాదాలపై ప్రత్యేక దృష్టి!

## గూడూరు సబ్‌కలెక్టర్ హామీ

వెంకటగిరి మండలంలో భూ కబ్జాలు, వివాదాలను నేరుగా పరిశీలించిన తర్వాతే తగిన చర్యలు తీసుకొన్న గూడూరు సబ్ కలెక్టర్ నివాస్ తెలిపారు. నూతనంగా బాధ్యతలు తీసుకొన్నిన తర్వాత మొట్ట మొదటిసారిగా వెంకటగిరి మండలంలో పర్యటించారు. రెవెన్యూ కార్యాలయానికి వచ్చిన ఆయన విఆర్‌ఓలతో సమీక్ష జరిపారు. బసవాయిగుంట, అమ్మపాళెం తదితర గ్రామాల్లోని భూ వివాదాలపై సెక్షన్ 145 అమలులో వుందని విఆర్‌ఓలు సబ్‌కలెక్టర్ దృష్టికి తీసుకొని వచ్చారు. దీనికి ఆయన స్పందిస్తూ ఈ భూములను స్వయంగా పరిశీలించి నిర్ణయం తీసుకొంటామన్నారు. ప్రజలకు బాధ్యత వహించి అధికారులు పని చేయాలన్నారు. మునిసిపల్ కమిషనర్ పుల్లారావు, ఎంపిడిఓ శివ ప్రసాద్‌తో వివిధ అంశాలపై చర్చించారు. అనంతరం వివిధ సమస్యలపై ప్రజలు అందజేసిన వినతి పత్రాలను స్వీకరించారు. ఈ కార్యక్రమంలో తహశీల్దార్ కృష్ణమూర్తి తదితరులు పాల్గొన్నారు.

# పాలకులకు ప్రజా సమస్యలు పట్టవు!

## వెంకటగిరి ఎమ్మెల్యే విమర్శ

రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వ పాలనలో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారని వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ విమర్శించారు. విద్యుత్ కోతలు, ధరలు పెరుగుదల ఇలా రకరకాల సమస్యలతో ప్రజలు సతమతం అవుతుంటే పాలకులు పట్టనట్లు వ్యవరిస్తూ తమ కుర్చీ కాపాడుకోవడానికి తంటాలు పడుతున్నారని దుయ్యబట్టారు. ఇటీవల ఆయన వెంకటగిరి టిడిపి కార్యాలయంలో విలేకరుల సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ విద్యుత్ కోతల కారణంగా సామాన్య ప్రజలతో పాటు పరిశ్రమలు, చిన్న చిన్న వ్యాపారాలు చేసేవాళ్లు ఉపాధికోల్పోతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. ఈ సమస్యలను పట్టించుకోవాల్సిన ముఖ్యమంత్రి, మంత్రులు ఎవరికి వారు పట్టనట్లు వ్యవహరిస్తుండడంతో రాష్ట్రం అస్తవ్యస్తంగా మారిందన్నారు. విద్యుత్ చార్జీలను పెంచినా పట్టించుకోని ప్రజలు విద్యుత్ కోతలతో మాత్రం ప్రభుత్వంపై మండిపడుతున్నారన్నారు. దీనిపై పెద్దఎత్తున ఆందోళన చేపడుతున్నట్లు వివరించారు.

• కావలిలో

# కాంగ్రెస్‌కు ఎదురుదెబ్బ!

## • వైకాపాలో చేరిన తిరువీధి ప్రసాద్

కావలిలో కాంగ్రెస్ సీనియర్ నేత తిరువీధి ప్రసాద్ వైఎస్ఆర్‌పార్టీ తీర్థం పుచ్చుకోవడంతో ఆ పార్టీలో కోలాహలం నెలకొంది. ఈ సందర్భంగా పట్టణంలో జెండాచెట్టు సెంటర్ నుంచి గాంధీబొమ్మ వరకు ర్యాలీ నిర్వహించి స్థానికంగా వుండే కళ్యాణమండపంలో భారీ సభ నిర్వహించారు. ఈ కార్యక్రమానికి విచ్చేసిన వైకాపా జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి మాట్లాడుతూ తిరువీధి ప్రసాద్ చేరికతో పార్టీ మరింత బలోపేతం అయిందని, అదే సమయంలో కాంగ్రెస్‌పార్టీ బలహీన పడిందన్నారు. టిడిపి నేత చంద్రబాబుకు బిసిలపై ఎక్కడలేని ప్రేమ పొంగుకు వచ్చిందని, అది కపటప్రేమ అని విమర్శించారు. తెలుగుదేశంపార్టీ పని అయిపోయిందని, కాంగ్రెస్‌పార్టీ అంపశయ్యపై వుందన్నారు. ఆ పార్టీకి కర్మకాండలు జరిపించేందుకే చిరంజీవి ఆ పార్టీలో చేరారని ఎద్దేవా చేశారు. ప్రసాద్ సేవలు పార్టీకి అవసరమని, ఆయనకు పార్టీలో సముచిత స్థానం కల్పిస్తామని మంచి భవిష్యత్తు వుంటుందని వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ కావలి నియోజకవర్గ ఇన్‌చార్జి రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి తెలిపారు. అనంతరం కొత్తగా పార్టీలో చేరిన ప్రసాద్ మాట్లాడుతూ కాంగ్రెస్ పార్టీలో యూత్ కాంగ్రెస్ అధ్యక్షుడిగా, మార్కెట్ కమిటి డైరెక్టర్‌గా పని చేశానన్నారు. వైఎస్ జగన్మోహన్‌రెడ్డితోనే రాష్ట్రంలో అభివృద్ధి సాధ్యమని భావించి పార్టీలో చేరినట్లు తెలిపారు. ప్రతాప్‌కుమార్‌రెడ్డి నేతృత్వంలో పార్టీ బలోపేతానికి కృషి చేస్తానన్నారు. ఈ కార్యక్రమంలో వైకాపా నేతలు చింతం బాబుల్‌రెడ్డి, చీదెళ్ల కిషోర్, షాహుల్ హమీద్, మాల్యాద్రి, విజయకుమార్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# మార్కెట్ కమిటీని అభివృద్ధి చేస్తా!

## వెంకటగిరిలో బాధ్యతలు స్వీకరించిన పులికల్లు!

వెంకటగిరి వ్యవసాయ మార్కెట్ కమిటీని అన్ని విధాలా అభివృద్ధి చేసి రైతులకు మరింత దగ్గర చేస్తామని కమిటీ ఛైర్మన్‌గా నూతన బాధ్యతలు చేపట్టిన పులికొల్లు రామారావు ప్రకటించారు. ఇటీవల ఛైర్మన్‌గా ప్రమాణ స్వీకారం చేసిన అనంతరం ఆయన వ్యవసాయ మార్కెట్ కమిటీలో విలేకరులతో మాట్లాడారు. ఈ పదవినిచ్చి రైతులకు సేవ చేయడానికి అవకాశం కల్పించిన నేదురుమల్లి దంపతులకు ఆయన కృతజ్ఞతలు తెలిపారు. మార్కెట్ కమిటీని అన్ని విధాలా అభివృద్ధి చేసేందుకు కృషి చేస్తానన్నారు. ఈ కార్యక్రమంలో మాజీ ఛైర్మన్ మధురెడ్డి, పెంచలకోన దేవస్థానం ఛైర్మన్ రవీంద్రరెడ్డి, స్థానిక నేతలు బ్రహ్మయ్య, కోటేశ్వరరావు, హరికృష్ణ, బాలయ్య, ప్రకాశం తదితరులు పాల్గొన్నారు.

# గూడూరు అభివృద్ధికే పాదయాత్ర

## పనబాక కృష్ణయ్య ప్రకటన

గూడూరు పట్టణాన్ని అన్ని విధాలా అభివృద్ధి చేయడమే తన లక్ష్యమని నియోజకవర్గ కాంగ్రెస్‌పార్టీ ఇన్‌చార్జ్ పనబాక కృష్ణయ్య తెలిపారు. ప్రజా సమస్యలను తెలుసుకొని వాటిని పరిష్కరించేందుకు పనబాక పట్టణ పరిధిలో పాదయాత్ర చేపట్టారు. ఈ పాదయాత్ర రెండవ పట్టణ పరిధిలోని పలు వార్డులలో సాగింది. ఈ సందర్భంగా కృష్ణయ్య మాట్లాడుతూ ఎందరో నేతలు గూడూరు శాసనసభ్యులుగా పనిచేసినా, ఎన్నో పదవులు అలంకరించినా పట్టణ అభివృద్ధిని విస్మరించారన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని పట్టణాన్ని తీర్చిదిద్దేందుకు ప్రజల సమస్యలు పరిష్కరించేందుకు ఈ పాదయాత్ర చేపట్టినట్లు వివరించారు. ఎవరూ చేయని విధంగా గూడూరును అభివృద్ధి చేస్తానని హామీ ఇచ్చారు ఆయన. ఈ కార్యక్రమంలో ఎఎంసి ఛైర్మన్ బాబురెడ్డి, కృష్ణారెడ్డి, గోపాల్‌యాదవ్, వాసు తదితరులు పాల్గొన్నారు.

# విఘ్నేశ్వరుని పుట్టినరోజే వినాయక చవితి!



భారతీయ పండుగలలో ప్రాధాన్యత గలది, వివిధ ప్రాంతాల ప్రజలు భక్తిశ్రద్ధలతో జరుపుకొనే పండుగ వినాయక చవితి. పార్వతీపరమేశ్వరుల పుత్రుడైన విఘ్నేశ్వరుడు పుట్టిన రోజే ఇది. భాద్రపద మాసంలో శుక్ల చతుర్థినాడు వినాయక చవితిగా జరుపుకోవడం ఆనవాయితి. చంద్రుడు వృద్ధి చెందే నాల్గవరోజున ప్రారంభమయ్యే ఈ పండుగను పలు ప్రాంతాలలో నవరాత్రులపాటు ఘనంగా నిర్వహిస్తారు. విఘ్నాలకు అధిపతి అయిన వినాయకుడు ఆనాడే విఘ్నాధిపత్యం పొందాడంటారు. ఎవరైనా ఏ కార్యక్రమం నిర్వహించాలన్నా, ఏ పని జరుపతలపెట్టినా ముందుగా వినాయకుడిని ఆరాధిస్తారు. ఎలాంటి విఘ్నాలు జరుగకుండా శుభంగా జరగాలని గణపతిని పూజిస్తారు. అందుకే ఆయన ప్రథమగణాధిపతి అయ్యాడు.

వినాయకుడు అంటే నాయకుడు లేని వాడని అర్థం. అనగా తనకు తానే నాయకుడు, త్వమేవాహమ్, అహంబ్రహ్మాస్మి అనే వాటికి సూచకం. సర్వగణాలకు, విఘ్నాలకు అధిపతి అయిన విఘ్నేశ్వరుని కొలవడం వలన శుభాలు కల్గుతాయి. అంతటి శక్తిగల గణనాధుడిని భాద్రపద శుక్లచవితినాడు తమ శక్తిమేర పూజించినట్లయితే ఆటంకాలు తొలగి సుఖశాంతులు లభిస్తాయని చెప్తారు. ఆనాడు పొద్దుటే లేచి స్నానం చేసి గణపతి విగ్రహం ప్రతిష్ఠించి పూజించాలి. మాచిపత్రి, గరిక, ఉత్తరేణి, ఉమ్మెత్త, తులసి, మారేడు, రేగు, మామిడి, గన్నేరు, మరువం, జమ్మి, రావి, దానిమ్మ, మద్ది, దేవదారు, జిల్లేడు తదితర 21 పత్రాలతో గణపతిని ఆరాధించాలి. అనంతరం వినాయక వ్రతకథను చదివి, నైవేద్యంగా ఆయనకు ఇష్టమైన కుడుములు, వుండ్రాళ్లను సమర్పించాలి. ఈ వినాయక వ్రతానికి సంబంధించి కథ ఒకటి వుంది. సూత మహాముని శౌన కాది మునులకు విఘ్నేశ్వర వ్రతకథను ఈ విధంగా వివరించాడు. గజరూపంలో గల రాక్షసుడు శివుని కోసం ఘోర తపస్సు చేస్తాడు. అతని తపస్సు మెచ్చి శివుడు ప్రత్యక్షమై వరం కోరుకోమంటాడు. అప్పుడు గజాసురుడు మీరు ఎల్లప్పుడూ నా పొట్టలో వుండాలని కోరగా పరమేశ్వరుడు అతని కోరిక తీర్చేందుకు ఆ అసురుని పొట్టలోనికి ప్రవేశిస్తాడు. కైలాసంలో వున్న పార్వతి దేవి శివుడి కోసం వెదుకుతూ గజాసురుని పొట్టలో వున్నాడని తెలుసుకొని, ఎలా బయటకు రప్పించాలో తెలియక విష్ణుమూర్తిని శరణు కోరుతుంది. అప్పుడు శ్రీహరి ఆమెను శాంత పరచి బ్రహ్మ తదితర దేవతలతో సమాలోచన జరిపి గజాసురుడిని చంపేందుకు గంగిరెద్దుల వారి మాదిరిగా వెళ్లేలా పథకం రచిస్తారు. ఆ ప్రకారం నందీశ్వరుడిని గంగిరెద్దుగా, బ్రహ్మాది దేవతలను వాయిద్యకారులుగా, శ్రీహరి సన్నాయి వాయిస్తూ గజాసుర పురానికి వెళ్లి రాక్షసుడిని సంతోష పెడతారు. గజాసురుడు ఏమి కావాలో కోరుకోమనగా ఈశ్వరుడిని వదిలిపెట్టమంటారు. అప్పుడు రాక్షసుడు వచ్చింది శ్రీహరి అని తెలుసుకొని తనకు చావు తప్పదని గ్రహించి తన ముఖం పూజలందుకొనేలా, తన చర్మం ధరించేలా శివుడిని అభ్యర్తిస్తాడు అందుకు సమ్మతించగానే విష్ణువు ఆజ్ఞపై నందీశ్వరుడు తన కొమ్ములతో గజాసురుడి పొట్ట చీల్చి శివుడిని బయటకు రప్పిస్తారు. అప్పుడు విష్ణుమూర్తి దుష్టులకు వరాలివ్వడం వలన కలిగే అనర్థాలను తెలియజెప్తాడు. ఇది వ్రత కథ. ఇక వినాయక చవితినాడు చంద్రుడు గణపతిని చూసి నవ్వడం వలన పార్వతి కోపంతో ఆనాడు చంద్రుడిని చూస్తే నీలాపనిందల పాలవుతారని శపిస్తుంది. శ్రీకృష్ణుడు సైతం దానిని తప్పించుకోలేకపోయాడు. అందుకే ఆనాడు చంద్రుడిని చూడొద్దని చెప్తారు.

జ్ఞానానికి, సంపదకు కారకుడైన వినాయకుడు ఏకదంతుడుగా మారడానికి రెండు కథలు ప్రచారంలో వున్నాయి. పంచమ వేదమైన మహాభారతాన్ని రచించే సమయంలో వేద వ్యాసుడు చెప్తుండగా గణపతి తన దంతాన్ని తొలగించి దాన్ని ఘంటంగా మార్చుకొని వ్రాసాడని, జ్ఞాన సముపార్జనకు ఎంతటి త్యాగానికైనా సిద్ధపడాలనే పరమార్థం ఇందులో ఇమిడివుందని అంటారు. అలాగే పరశురాముడితో జరిగిన పోరాటంలో పరశువు తగిలి ఒక దంతం విరిగిపడిందని చెప్తారు. విశేష ప్రాధాన్యం గల వినాయక చవితిని భక్తి శ్రద్ధలతో జరుపుకొన్నట్లయితే సకల శుభాలు కల్గుతాయని పురాణాలు చెప్తున్నాయి.



సభలు - సమావేశాలు

# నెల్లూరులో విజయవంతంగా సైన్స్‌ఫేర్!

నెల్లూరు నగరంలోని విఆర్ కళాశాలలో రాష్ట్రస్థాయి వైజ్ఞానిక ప్రదర్శనలు ఈనెల 10న ప్రారంభమైనాయి. మూడు రోజులపాటు జరిగిన ఈ ప్రదర్శనలను రాష్ట్ర సాంఘిక సంక్షేమశాఖ మంత్రి పితాని సత్యనారాయణ ప్రారంభించారు. రాష్ట్రంలో 9 జిల్లాల నుంచి 524 పాఠశాలల విద్యార్థులు పాల్గొని వివిధ నమూనాలను ప్రదర్శించడం జరిగింది. విద్యాశాఖ ఆధ్వర్యంలో ఏర్పాటు చేసిన ఈ కార్యక్రమానికి ఎటువంటి ఇబ్బందులు తలెత్తకుండా అన్ని ఏర్పాట్లు చేశారు. 24 గంటలు విద్యుత్ సరఫరా అందించడంతోపాటు విద్యార్థులకు అవసరమైన వైద్యసేవలు అందించేందుకు వైద్య ఆరోగ్యశాఖ ఆధ్వర్యంలో ఒక శిబిరాన్ని ఏర్పాటు చేశారు. నగరంలో వివిధ పాఠశాలలకు చెందిన పాఠశాలల విద్యార్థులు వైజ్ఞానిక ప్రదర్శనకు హాజరై నమూనాలను తిలకించారు.

విద్యుత్ కోతల నివారణకు విద్యుత్ ఘర్షణ వంతెన నమూనాను మర్రిపాడు మండలానికి చెందిన విద్యార్థి వెంకటలక్ష్మి రూపొందించింది. మహబూబ్‌నగర్ జిల్లా మణికొండ పాఠశాలలకు చెందిన వెంకటేష్ అనే విద్యార్థి రూపొందించిన రైళ్లలో ముందస్తు ప్రమాదాల గుర్తింపు నమూనా ఎంతగానో ఆకట్టుకుంది. నెల్లూరు నగరంలోని విజ్ఞాన్ ఇంగ్లీష్ మీడియం పాఠశాలకు చెందిన చైతన్య, రాజీవ్ అనే విద్యార్థులు రూపొందించిన నదీతీరాలపై ఇసుక తరలింపు వల్ల తీరప్రాంతాలలో వచ్చే ఇబ్బందిపై ప్రదర్శించిన నమూనా అందరినీ ఆకట్టుకొంది. విద్యార్థుల్లో దాగిన నైపుణ్యతను వెలికి తీసేందుకు నెల్లూరు నగరంలో రాష్ట్రస్థాయి వైజ్ఞానిక ప్రదర్శనను ఏర్పాటు చేసినట్లు ప్రాథమిక విద్యాశాఖ మంత్రి శైలజానాథ్ పేర్కొన్నారు. సైన్స్ పట్ల ఆలోచన పెంచుకొని భవిష్యత్‌లో శాస్త్రవేత్తలుగా మారాలని మంత్రి కోరారు.

విద్యార్థులకు ఇష్టమైన అంశాలకు ప్రాధాన్యతనివ్వాలని ఆయన సూచించారు. సైన్స్, సమాజం పట్ల అవగాహన కలిగి వుండాలన్నారు. జిల్లా ఇన్‌చార్జి మంత్రి పితాని సత్యనారాయణ మాట్లాడుతూ విద్యార్థులు అన్ని రంగాలతోపాటు సైన్స్‌పై కూడా దృష్టి సారిస్తే ఆలోచనలో మార్పు వస్తుందన్నారు. ఇలాంటి ప్రదర్శనల ద్వారా మరిన్ని అవకాశాలు అందిపుచ్చుకోవచ్చని అభిప్రాయపడ్డారు. ఎమ్మెల్సీ విఠపు బాలసుబ్రహ్మణ్యం మాట్లాడుతూ 10వ తరగతి తర్వాత సైన్స్‌ను ఒక భాగంగా తీసుకోవాలని విద్యార్థులకు సూచించారు. దీనికిగానూ కేంద్ర ప్రభుత్వం నెలకు 4వేల రూపాయలు, సంవత్సరానికి 16 వేల రూపాయలు గ్రాంటుగా అందిస్తుందని గుర్తు చేశారు. అలాగే డిగ్రీ వారికి నెలకు 5వేల రూపాయలు, గ్రాంటుగా 20వేల రూపాయలు, పిజి విద్యార్థులకు నెలకు 7వేల రూపాయలు, గ్రాంటుగా 28వేల రూపాయలు అందిస్తుందన్నారు.



సైన్స్‌ఫేర్‌లో విద్యార్థిని తయారు చేసిన నమూనాను గురించి ఆసక్తికరంగా అడిగి తెలుసుకొంటున్న మంత్రులు పితాని సత్యనారాయణ, సాకే శైలజానాథ్.

విద్యార్థులు సైన్స్‌ననుసరించి నడవకపోవడంతోపాటు ఆసక్తి కూడా చూపకపోవడం బాధాకరంగా వుందన్నారు. ఈ కార్యక్రమంలో ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, ఎమ్మెల్సీలు వాకాటి నారాయణరెడ్డి, శ్రీనివాసులురెడ్డి, విఠపు బాలసుబ్రహ్మణ్యం, జిల్లా కలెక్టర్ శ్రీధర్, మునిసిపల్ కమిషనర్ టిఎస్సార్ ఆంజనేయులు ప్రభుత్వ, ప్రైవేటు పాఠశాలల విద్యార్థులు, ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

# వారఫలాలు

*తేది 15-09-2012 నుండి 21-09-2012 వరకు వృషభంలో గురు, కేతువులు; కర్కాటకంలో శుక్రుడు; 18తేది వరకు రవి సింహంలో తదుపరి కన్యలో; కన్యలో బుధుడు; తులలో కుజ, శనులు; వృశ్చికంలో రాహువు; సింహ, కన్య, తుల, వృశ్చికాలలో చంద్రుడు సంచరిస్తారు.*



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

పనులన్నీ అసంతృప్తిగా లేదా వాయిదా పడటం జరుగుతుంది. చీకాకుగా వుంటుంది. శరీరారోగ్య లోపం, శారీరక అలసట, కుటుంబంలో కలహాలు, భార్యాభర్తల మధ్య బేదాభిప్రాయాలు వుంటాయి. తొందరపాటుతో ఇతరులకు హామీలివ్వవద్దు. వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు సామాన్యం. ఆర్థిక లావాదేవీలలో నష్టం కలుగవచ్చు. విద్యార్థులు ఉన్నత విద్యలకై చేసే ప్రయత్నాలలో ఆటంకాలెదురౌతాయి.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

గతవారం కంటే మేలనిపిస్తుంది. చేసే పనులలో అనుకూలతలు సాధిస్తారు. వృత్తి, వ్యాపార రంగాల వారికి ధనాదాయం, సంతోష వార్తలు వినడం, ఉద్యోగులకు మనశ్శాంతి. కోర్టు వ్యవహారాలు అనుకూలిస్తాయి. విద్యార్థులకు ప్రయాణ లాభాలు. వ్యవసాయదారులకు గతంకన్నా మేలుగా వుండి, ఆర్థికాదాయం వుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి అప్రయత్న ధనలాభం.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

శుభగ్రహ వీక్షణచే తలపెట్టిన పనులన్నీ పూర్తిచేయగలరు. అన్ని రంగాల వారికి లాభదాయకంగా వుంటుంది. వృత్తి, వ్యాపారులు పుంజుకుంటారు. ఆర్థిక నిలకడ వుంటుంది. ఉద్యోగులు నూతన వాహన సౌకర్యం, పై అధికారుల మన్ననలు పొందగలరు. విద్యార్థులు క్రమశిక్షణతో ఉన్నత విద్యలకై చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. రాజకీయ నాయకులకు పై, క్రింది వర్గాలతో స్వల్ప ఇబ్బందులు, కష్టాలు.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

తలచిన పనులు పూర్తి చేస్తారు. కుటుంబ సౌఖ్యం, విందు, వినోదాలు, ప్రయాణాల వల్ల లాభాలు. నూతన కార్యక్రమాలు ప్రారంభించుట. వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు వ్యవహారానుకూలతలేర్పడగలవు. శరీరారోగ్యం, కీర్తి వుంటుంది. విద్యార్థులకు ఒంటరి జీవితం మంచిది కాదు. ధైర్యసాహసాల ఆలోచన రానీయవద్దు. వ్యవసాయదారులకు పనులు పుంజుకున్నా ఆర్థిక వాగ్దాన భంగాలుంటాయి.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

పనులన్నీ సకాలంలో పూర్తైనా, శుభకార్య యత్నాలు వాయిదా పడగలవు. కుటుంబ వ్యవహారాలు అనుకూలిస్తాయి. వృత్తి, వ్యాపార రంగాల వారికి ఆర్థికస్థితి మెరుగ్గా వుంటుంది. ఉద్యోగుల వ్యక్తిగత ప్రతిష్టలకు భంగకరం. మనోవ్యాకుల్యత వుంటుంది. రుణదాతల వత్తిడి అధికం. విద్యార్థులు సమయస్ఫూర్తి పాటించి, ధైర్యంతో విజయం సాధించగలరు. కళా, క్రీడాకారుల ఇష్టార్థ సిద్ధి కలుగును.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

తలపెట్టిన పనులలో విజయం. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారు కీలక బాధ్యతలను నిర్వహిస్తారు. నూతన ప్రక్రియకు ఇది మంచి అవకాశం. భాగస్వామ్య ఒప్పందాలు సంతృప్తినిస్తాయి. విద్యార్థుల సృజనాత్మకతకు, ప్రతిభకు రాణింపు. వ్యవసాయదారులు చేసే పనులలో భయాందోళనలు తగ్గుతాయి. రాజకీయులు అపఖ్యాతి, విమర్శలు ఎదుర్కొంటారు. నిరుద్యోగులకు ఆశాజనకం.



**తుల**
చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

పనులలో గతవారం కంటే మేలనిపిస్తుంది. మానసిక విచారం తగ్గుతుంది. జీవన భృతిపై ఆలోచన పెరుగుతుంది. కార్యసిద్ధితో ఆర్థికలబ్ధి ఏర్పడుతుంది. శుభకార్య ప్రయత్నాలు ప్రారంభిస్తారు. వృత్తి, వ్యాపార రంగాల వారికి నూతనోత్సాహం పెరుగును. పుకార్లను నమ్మవద్దు. విద్యార్థులు స్వల్ప విజయాలతో తృప్తిపడగలరు. వ్యవసాయ రంగంలోని వారికి రుణసౌకర్యం లభిస్తుంది.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

పనులన్నీ తీవ్ర కష్టంతో నెరవేరుతాయి. శత్రువులు, వైరాలు ఎక్కువ. కొందరికి చేదు అనుభవాలు ఎదురౌతాయి. వృత్తి, వ్యాపారాలలోనివారు స్థిరమైన ఆదాయానికి ఆలోచనలు చేస్తారు. దైవ కార్యాచరణపై మొగ్గు చూపుతారు. స్త్రీలకు ఊహించని ఖర్చులుంటాయి. విద్యారంగంలోని వారికి నూతన సమస్యలు తలనొప్పినిస్తాయి. కళా, క్రీడా రంగాలలోని వారు నిందారోపణలు ఎదుర్కొంటారు.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

తలపెట్టిన పనులలో ఆటంకాలున్నా మనోనిబ్బరాన్ని పెంచుకొంటారు. స్థానచలన సూచనలున్నాయి. మిత్రుల, సన్నిహితుల సూచనలు, సలహాలు పాటించండి. వృత్తి, వ్యాపారాలలోని వారికి పోటీదారుల వల్ల ఆదాయంలో గండి, స్వల్ప ఆటంకాలు. కుటుంబంలో వ్యవహారానుకూలత, శాంతి ఏర్పడగలవు. విద్యార్థులకు ప్రోత్సాహకరమైన వాతావరణం వున్నప్పటికీ అనవసర ధనవ్యయం.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

సకాలంలోపనులు పూర్తిచేయగలరు. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థికాదాయం బాగుండి సంపాదనలో ముందంజ వేస్తారు. స్పెక్యులేషన్ లాభించదు. ఉద్యోగులు తలచిన కార్యాలు విజయవంతమౌతాయి. ఆర్థిక విషయాలలో ఇతరులకు హామీలివ్వవద్దు. అవివాహితులకు శుభవార్తలు. వ్యవసాయదారులు ఇతరుల సలహాలతో తమ పనులలో విజయం సాధిస్తారు.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

గతవారం కంటే ప్రతికూలంగా వుంటుంది. ప్రతి పనిలో జాప్యం పెరుగును. వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు జీవనోపాధి విషయంలో స్థిరత్వం లోపిస్తుంది. సంతాన విషయమై స్వల్ప ఆందోళన. విద్యార్థులకు విద్యా విషయాలలో కొంత ఆశాజనక స్థితి. కృషికి తగిన ఫలితాన్ని పొందుతారు. కళా, క్రీడా రంగాలలోని వారికి ఆరోగ్య లోపించి ధనవ్యయం.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

గతవారంలో వాయిదాపడిన పనులకు స్థిరత్వ లోపాలను తెలుసుకొంటారు. చేసే పనులపై ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. వృత్తి, వ్యాపారాలలోని వారు ఆర్థిక సమస్యల పరిష్కారం చేసుకొంటారు. ఉద్యోగులు నూతనోత్సాహంతో వుంటారు. విద్యార్థులు ప్రతిబంధక సమస్యలపై విజయం సాధిస్తారు. వ్యవసాయదారులకు ఆశాజనక పరిస్థితులుంటాయి. స్పెక్యులేషన్ యోగవంతం కాదు.

## పంచాంగం

17తేది నిజభాద్రపదమాస చంద్రోదయం.
18తేది జిల్హాజ్ నెల ప్రారంభం.
19తేది వినాయక చవితి.
20తేది ఋషి పంచమి.
21తేది సూర్య షష్ఠి.

### శుభ ముహూర్తాలు

అధిక తదుపరి నిజ భాద్రపదమాసం శూన్య మాసం కావడంతో వివాహాది శుభకార్యాలకు ముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య శుభకార్యాలకు సుముహూర్తాలున్నాయి.

### సెప్టెంబరు తిథులు

**అధిక భాద్రపద బహుళ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 15 | శని | చతుర్ధశి | ప | 09.39 | గం.ల.వ |
| 16 | ఆది | అమావాస్య | ఉ | 07.39 | గం.ల.వ |
| | | **నిజ భాద్రపద శుక్ల** | | | |
| | తదుపరి | పాడ్యమి | తె | 05.16 | గం.ల.వ |
| 17 | సోమ | విదియ | రా | 02.39 | గం.ల.వ |
| 18 | మంగళ | తదియ | రా | 11.56 | గం.ల.వ |
| 19 | బుధ | చవితి | రా | 09.14 | గం.ల.వ |
| 20 | గురు | పంచమి | సా | 06.39 | గం.ల.వ |
| 21 | శుక్ర | షష్ఠి | సా | 04.16 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.

# స్వంత ఇంటితో ధర్మ కామార్థ మోక్ష పురుషార్థాలు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*డాక్టర్ ఎస్.శివన్నారాయణ — కర్నూలు*

** ఎక్కడో చదివిన శ్లోకంలో స్వంత యిల్లు లేకపోతే మంచి ఫలితాలు దక్కవని చదివినట్లు గుర్తు.*

"గృహస్థన్య క్రియా... గృహం వినా" అనే శ్లోకం ఇది. ధర్మార్థ కామ మోక్షాలు, పురుషార్థాలు గృహస్థకు స్వంత యింటి వల్లే లభిస్తాయన్నది అర్థం.

*డాక్టర్ మహిత — చెన్నై*

** వాస్తు శాస్త్రాలు ఏ కాలంలో ఉద్భవించాయి. వాటికి ఆధారాలు తెలపండి?*

వాస్తు శాస్త్రాలు క్రీ.శ ఒకటవ శతాబ్ది నుంచి ఆవిర్భవించాయి. క్రీ.పూలోనూ అనువంశిక వాక్ రూపంలో ప్రచారాలుండేవి. మత్స్యపురాణంలో కాకుండా అగ్ని, భవిష్యోత్తర, స్కంద పురాణాలలోనూ ఆగమ, జ్యోతిశాస్త్రాలలోనూ చాలా వాస్తు ప్రస్తావనలున్నాయి.

*ఏ.వి.జానకి — కర్నూలు*

** విదేశాలలో గృహాలకు ప్రహరీలు ఉండవు కదా? ఫలితాలెట్లా ఉంటాయి?*

శరీరానికి వస్త్రాల్లాగా, గృహాలకు ప్రహరీలు రక్షణ కవచాలు. వాళ్లు అందువల్లే కోణ, దృష్టి, వేధలతో సతమతమవుతుంటారు.

*డి.విష్ణుశర్మ — నాయుడుపేట*

** ఆగమ శాస్త్రంలో దేవాలయ పంచ ప్రాకారాలను గురించి వివరించారా?*

ఆగమ శాస్త్రంలో దేవాలయ వాస్తువులో పంచ, సప్త ప్రాకారాల వర్ణనలున్నాయి. పంచ ప్రాకారాల నిర్ణీత నామములివి. అంతర్హార, మధ్యహార, బాహ్యహార, మర్యాది. వీటి ప్రమాణ మంత్ర వివరాలు కూడా గ్రంథాలలో ఉన్నవి.

*వై.కుమారాచారి — సికింద్రాబాద్*

** జ్యోతిశ్శాస్త్రం అంగీకార యోగ్యమైన శాస్త్రమేనా?*

ప్రాచీన భారతీయ శాస్త్రాల్లో ఏ పరికరాలూ లేని కాలంలో కేవలం యోగ దృష్టితో గమనించి, గణించి, రాయబడిన శాస్త్రం జ్యోతిషం. ఆ రోజు ఏ నిర్ణయాలైతే జరిగాయో ఈ రోజూ అవే కొనసాగడం శాస్త్రం నిర్దుష్టత! నిబద్ధత!!

*ఎన్.శకుంతలాపద్మనాభన్ — తడ*

** 'గుడి'రథ నిర్మాణం ఏ శాస్త్రంలో ఉంది.*

ఆలయరథ నిర్మాణం 'ఆగమ శాస్త్రం'లో సవివరంగా వివరించబడింది. దారువు(కొయ్య) వాడాలన్నది నిబంధన.

*ఎన్.విశాల్‌పిట్టి — హైదరాబాద్*

** ప్రాచీన వాస్తు శాస్త్రాలు సురక్షితమేనా?*

భారతీయ సంపదలవి. వాటిని కాపాడుకోవలసిన బాధ్యత మనది. కొన్నింటిని సాంప్రదాయ గ్రంథ ప్రచురణ సంస్థలు ప్రచురించాయి. ఏమైనా భారత ప్రభుత్వం ప్రాచీన శాస్త్రాలను 'మైక్రోఫిల్మ్' తీయించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

*ఏ.హిమబిందు — పుంగనూరు*

** ఆలయాల గోపురాలపైనే పిడుగులు ఎందుకు పడతాయి?*

గోపురాలలోని లోహం, సున్నం వంటి మిశ్రమాలు అయస్కాంత ధృవాలుగా మారుతాయని ప్రఖ్యాత శాస్త్రవేత్త రాబర్ట్ బెంజిమన్ సిద్ధాంతం. పచ్చని చెట్లపై కూడా పిడుగులు పడతాయి.

*సి.వీరభద్రాచార్యులు — విజయవాడ*

** వాస్తు లోపాల వల్ల చాలా 'గుడులు' శిథిల మౌతున్నాయా?*

నిర్లక్ష్యం, నిర్మాణాల పగుళ్లపై అలక్ష్యం, ఆలయ ఆస్తుల దురాక్రమణ, దుర్వినియోగం, స్వార్థం ఇవన్నీ కారణాలు. వాస్తుపై నెపం మోపడం తమ తప్పుల్ని కప్పిపుచ్చుకోవడమే.

*డాక్టర్ మహేష్ — సికింద్రాబాద్*

** వధూవర నిర్ణయానికి జ్యోతిష శాస్త్రం చెప్పిన గుణమేళన వంటి పంతొమ్మిది పద్ధతుల్ని చూడవలసిందేనా?*

పిల్లలకు ముందు సంస్కారవంతమైన కుటుంబం, తెలివితేటలు, సంపాదన గల వరుడు అవసరం. జ్యోతిషం తర్వాతది. రాశి, నక్షత్ర ఫలితాలు బాగుంటే చాలు.

*పి.శ్యామసుందరం — చెన్నై*

** 'పసుపు పచ్చ' రాయి నేను వేసుకోవచ్చా?*

మీకు 'పచ్చ'(ఎమరాల్డ్) సరైన రాయి. ఉంగరం, చిటికెన వ్రేళ్లకు తప్ప తక్కిన వాటికి ఉంగరాలు ధరించడం మేలుకన్నా కీడు ఎక్కువ జరుగుతుంది.

# స్థానిక సంస్థల ఎన్నికలకు సమాయత్తం!

> స్థానిక సంస్థల ఎన్నికలు నిర్వహించాలని రాష్ట్ర హైకోర్టు తీర్పు వెలువరించడంతో రాజకీయ పార్టీలు గ్రామాలవైపు దృష్టి సారించాయి. అన్ని పార్టీల నేతలు గ్రామాల్లోని తమ పార్టీ నాయకులు, కార్యకర్తలతో చర్చలు జరపడం మొదలెట్టారు.

జిల్లాలో స్థానిక సంస్థల ఎన్నికల నిర్వహణకు అధికార యంత్రాంగం సమాయత్తమౌతోంది. ఇటీవల రాష్ట్ర హైకోర్టు స్థానిక సంస్థల ఎన్నికలను మూడు నెలల్లోగా నిర్వహించాలని ఉత్తర్వులు జారీచేసిన సంగతి తెలిసిందే. కోర్టు ఉత్తర్వులు వెలువడిన అనంతరం రాష్ట్ర ప్రభుతం ఉన్నతస్థాయి సమీక్షా సమావేశం నిర్వహించి స్థానిక సంస్థల ఎన్నికల నిర్వహణకు సంబంధించి చర్చించడం జరిగింది. స్థానిక సంస్థలకు ఎన్నికలు నిర్వహించాలన్న నిర్ణయానికి వచ్చినప్పటికీ అధికారికంగా మాత్రం ఎటువంటి ప్రకటన చేయలేదు. అయినప్పటికీ జిల్లా అధికారులకు ప్రభుత్వం నుంచి ఎన్నికల ఏర్పాట్లకు సంబంధించిన ఆదేశాలందాయి. దీంతో జిల్లా యంత్రాంగం స్థానిక సంస్థల వివరాలు, ఓటర్ల నమోదు, సవరణలపై దృష్టి సారించింది.

పంచాయితీల జాబితా, రిజర్వేషన్ల ఖరారు తదితర అంశాలను అధికారులు పరిశీలిస్తున్నారు. 2011 జనాభా లెక్కల ప్రకారం స్థానిక సంస్థల్లో ఎస్సీ, ఎస్టీ, బిసి రిజర్వేషన్లు ఖరారు చేయాల్సి ఉంటుంది. వీటితో పాటు ఓటరు తుది జాబితా కూడా రూపొందించాల్సి ఉంటుంది. స్థానిక సంస్థల కాలపరిమితి ముగిసి దాదాపు రెండు సంవత్సరాలు కావస్తుంది. ఈ రెండు సంవత్సరాల కాలంలో స్థానిక సంస్థలకు ఎన్నికలు నిర్వహించేందుకు రాష్ట్ర ప్రభుత్వం వెనకడుగు వేసింది. ఎన్నికల నిర్వహణ, రిజర్వేషన్ల ఖరారుపై కొందరు రాష్ట్ర హైకోర్టును ఆశ్రయించడంతో కోర్టు విచారణ జరిపి ఎన్నికల నిర్వహణకు అభ్యంతరం లేదంటూ తెలిపింది. మరో ఆరు నెలలపాటు ప్రత్యేకాధికారులు కొనసాగే అవకాశం ఉంది. ప్రత్యేకాధికారుల నియామకం గడువు పూర్తికాక ముందే ఎన్నికలు జరపాలన్నది కోర్టు అభిప్రాయం. అయితే రిజర్వేషన్లు ఖరారు విషయంలో కొంత సందిగ్ధం ఏర్పడడంతో ప్రభుత్వం స్పష్టమైన నిర్ణయం తీసుకోలేక పోతుంది.

ఎన్నికల సంఘం కూడా స్థానిక సంస్థల ఎన్నికలు నిర్వహించేందుకు సిద్ధంగా ఉన్నట్లు ప్రకటించింది. ఈ నేపథ్యంలో ఓటరు జాబితాను అక్టోబర్ 1న ప్రకటించాలని కోరింది. రిజర్వేషన్లు ఖరారు చేసే విషయంలో రాష్ట్ర ప్రభుత్వం సరైన నిర్ణయం తీసుకోలేక పోతుండడంతో ఎన్నికల నిర్వహణపై సుప్రీంకోర్టును ఆశ్రయించే అవకాశం లేకపోలేదని రాజకీయ పార్టీల నేతలు చెబుతున్నారు. రిజర్వేషన్లు 50 శాతానికి మించి ఉండరాదని సుప్రీం కోర్టు గతంలోనే ప్రకటించింది. 2011 జనాభా లెక్కల ప్రకారం జిల్లాలో 26 లక్షలకు పైగా నమోదై ఉన్నారు. గ్రామ పంచాయితీలు, మండలాల వారీగా పరిశీలించి రిజర్వేషన్లు ఖరారు చేయాలి.

### రాజకీయ పార్టీల సన్నాహాలు

స్థానిక సంస్థల ఎన్నికలు నిర్వహించాలని రాష్ట్ర హైకోర్టు తీర్పు వెలువరించడంతో రాజకీయ పార్టీలు గ్రామాలవైపు దృష్టిసారించాయి. గ్రామ పంచాయితీ, మండల పరిషత్, జిల్లా పరిషత్‌లతోపాటు మునిసిపల్ ఎన్నికలు కూడా జరిగే అవకాశం ఉంది. రాష్ట్ర ప్రభుత్వం ప్రకటన చేసిన వెంటనే దశలవారీగా స్థానిక సంస్థల ఎన్నికల నిర్వహణకు సంబంధించి ఎన్నికల సంఘం నోటిఫికేషన్ జారీ చేయనుంది. ఈ ఎన్నికల నిర్వహణకు మూడు నెలలు గడువు ఇవ్వడంతో ఈ క్రమంలో రాజకీయ పార్టీల నేతలు తమ పార్టీకి చెందిన కార్యకర్తలు, నాయకులతో సమావేశాలు ఏర్పాటుచేసి బలోపేతం చేసేందుకు ప్రయత్నాలు చేస్తున్నారు.



నెల్లూరు జిల్లా పరిషత్ కార్యాలయం.

అధికార కాంగ్రెస్ పార్టీతోపాటు తెలుగుదేశం, సిపిఎం, సిపిఐ, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నేతలు స్థానిక నాయకులతో సమాలోచనలు ప్రారంభించారు. ఎన్నికల్లో సత్తాచాటి 2014లో జరుగబోయే అసెంబ్లీ ఎన్నికల్లో జిల్లాలో అన్ని స్థానాలు గెలుచుకోవాలని తెలుగుదేశం ప్రయత్నిస్తుండగా, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ జిల్లాలో అన్ని గ్రామ పంచాయితీలు, మండల పరిషత్‌లను కైవసం చేసుకోవాలన్న పట్టుదలతో ఆ పార్టీ నేతలు సమావేశాలు నిర్వహిస్తున్నారు. ప్రతిరోజు ఏదో ఒక మండలంలో నేతలు కార్యకర్తలు, నాయకులతో చర్చలు జరుపుతున్నారు.

**మార్పుకు శ్రీకారం**

# కొత్త పథకాలతో గిరిజనుల జీవితాల్లో వెలుగు!

జిల్లాలో గిరిజన విద్యార్థుల కోసం సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థ(ఐటిడిఏ) శ్రీకారం చుట్టింది. జిల్లాలో ఐటిడిఏ ఏర్పడి దాదాపు 12 సంవత్సరాలు కావస్తుంది. ఈ పన్నెండు సంవత్సరాల కాలంలో ప్రభుత్వం విడుదల చేస్తున్న అరకొర నిధులతోనే వివిధ సంక్షేమ పథకాలు మంజూరు చేసేవారు. ఇప్పటికే కాలువగట్టు, ఊరి చివరన పూరి గుడిసెలు ఏర్పాటు చేసుకుని జీవనం సాగిస్తున్న వారు అనేక మంది ఉన్నారు. అధికారులు, ప్రజాప్రతినిధులు పర్యటనలకెళ్లినపుడు గిరిజన నివాస ప్రాంతాలను అసలు సందర్శించరు. కేవలం సభలు, సమావేశాల్లో పాల్గొని గిరిజనుల సంక్షేమం కోసం కోట్ల రూపాయలు ఖర్చు చేస్తున్నట్లు ప్రకటనలు గుప్పిస్తుంటారు.

గ్రామీణ ప్రాంతాల నుంచి ఉన్నత చదువులు చదువుకొనేందుకు వచ్చే గిరిజన విద్యార్థులను ప్రోత్సహించే వారు కరువయ్యారు. దీంతో 7వ తరగతి వరకే చదివి వీరు సరిపెట్టుకొంటున్నారు. ఐటిడిఏ ప్రాజెక్టు అధికారులుగా ఈ పన్నెండు సంవత్సరాల్లో తొమ్మిది మంది నియమితులయ్యారు. వీరందరూ కూడా గిరిజన జీవన విధానంపై సరైన అవగాహన చేసుకోలేక పోయారు. పదివేల రూపాయల బడ్జెట్ అంటూ సైకిల్, చేపలు పట్టే వల, రిక్షాలు అందజేసి చేతులు దులుపుకొనే వారు. కొన్ని నెలలకే ఇవి పాడై పోయేవి. ప్రభుత్వం మంజూరు చేసే పదివేల రూపాయలతో గిరిజనుల బ్రతుకులు ఎలా మారుతాయో పాలకులకే తెలియాలి. గత సంవత్సరం ఐటిడిఏ పిఓగా బాధ్యతలు చేపట్టిన యాకసిరి వెంకటేశ్వర్లు గిరిజనుల కోసం ప్రభుత్వం అమలు చేస్తున్న పథకాల చిట్టా బయటకు తీశారు.

జిల్లాలోని గిరిజనుల వివరాలు సేకరించడంతో పాటు వారి పిల్లల చదువుపై ప్రత్యేక శ్రద్ధ చూపించారు. ఇప్పటివరకు అందిస్తున్న రిక్షాలు, చేపల వల, సైకిళ్లతోపాటు ఆర్థిక చేయూతనిచ్చే పథకాలను వారికి వర్తింపజేయాలని కిందిస్థాయి అధికారులను ఆదేశించడం జరిగింది. భూమి అభివృద్ధి పథకం, పాడి పశువుల కొనుగోలు, పండ్ల తోటల పెంపకం, మైనర్ ఇరిగేషన్, నిరుద్యోగులకు వివిధ వృత్తుల యందు శిక్షణా కార్యక్రమాల ఏర్పాటుకు ప్రయత్నాలు మొదలుపెట్టారు. 2011 సంవత్సరం జనాభా లెక్కల ప్రకారం జిల్లాలోని 46 మండలాలు, 116 గ్రామాల్లో రెండు లక్షలకు పైగా గిరిజనులు ఉన్నారు. ఇప్పటి వరకు వారికి మంజూరు చేసిన పథకాలు, కుటుంబ పరిస్థితులు, ఎంతమేరకు ఆర్థికంగా ఎదిగారన్న దానిపై పిఓ సమాచారం సేకరించే పనిలో పద్దారు.

> **సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థలో పిఓగా బాధ్యతలు తీసుకొన్న యాకసిరి వెంకటేశ్వర్లు చిత్తశుద్ధితో గిరిజనుల జీవితాల్లో మార్పు తెచ్చేందుకు భూమి అభివృద్ధి పథకం, పాడి పశువుల కొనుగోలు, పండ్ల తోటల పెంపకం, మైనర్ ఇరిగేషన్, నిరుద్యోగులకు వివిధ వృత్తి విద్యలలో శిక్షణకు పూనుకోవడంతో పరిస్థితులలో మార్పు కనపడుతుంది.**

ఒకప్పుడు ఐటిడిఏ కార్యాలయానికి రావాలంటే భయపడే గిరిజనులు నేడు నేరుగా పిఓను కలిసి తమ సమస్యలు విన్నవించుకుంటున్నారు. గిరిజన విద్యార్థుల కోసం "పునాది" అనే పథకాన్ని ప్రారంభించి పాఠశాలలు, హాస్టళ్లలో చేర్పించేందుకు కృషి చేశారు. ఇందుకుగాను రాష్ట్ర ప్రభుత్వం నుంచి ఆగష్టు 15వ తేదీ జరిగిన స్వాతంత్ర్య వేడుకల్లో సేవా పథకం అందుకున్నారు. గిరిజన విద్యార్థులు చదువు మధ్యలో నిలిపి వేయకుండా "క్వాలిటీ ఎడ్యుకేషన్" పేరుతో వీరికి కార్పొరేట్ విద్యాసంస్థల్లో ప్రవేశాలు కల్పించారు. నిరుద్యోగ యువత కోసం గత వారంలో ఎంప్లాయిమెంటు జనరేషన్ మార్కెటింగ్(భవిత) పేరుతో రాజీవ్ యువకిరణాల సమన్వయంతో సాంకేతిక పరిజ్ఞానంతో శిక్షణా కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు.

పథకాలు మంజూరుచేసి కార్యాలయాలకే పరిమితం కాకుండా లబ్ధిదారుల గ్రామానికి వెళ్లి పరిశీలన చేస్తున్నారు. సంక్షేమ పథకాలు మంజూరు చేస్తామంటే ముందుకురాని వారు నేడు వినతి పత్రాలు తీసుకుని కార్యాలయానికి వచ్చే విధంగా గిరిజనులకు అవగాహన కల్పిస్తున్నారు. గిరిజన సంఘాల పేరుతో పైరవీలు చేయించుకుని బినామీ పేర్లతో గతంలో రుణాలు పొంది రాజకీయ నేతల మాదిరిగా పోజులు కొట్టే వారు కార్యాలయంలో అడుగు పెట్టేందుకు వెనకడుగు వేస్తున్నారు. మధ్యవర్తుల ప్రమేయం లేకుండా నేరుగా కార్యాలయానికి వచ్చిన వారి సమస్యలు పరిష్కరిస్తున్నారు. గతంలోలా కాకుండా నిత్యం అందుబాటులో ఉంటున్న ప్రస్తుత పిఓ వెంకటేశ్వర్లుని గిరిజనులు మెచ్చుకుంటున్నారు.

## అమీకు హ్యాంగోవర్



సినీ తారలు రాత్రివేళల్లో పార్టీలకు హాజరు కావడమనేది సాధారణ విషయమే. నవతరం హీరోలు, హీరోయిన్లు వీలుచిక్కితే తెల్లవార్లూ పబ్బుల్లోనూ, డిస్కోల్లోనూ ఎంజాయ్ చేస్తుంటారు. ఈ ధోరణి దర్శక, నిర్మాతలకు ఇబ్బందిగా మారుతోంది. తమ హీరో హీరోయిన్లు షూటింగ్‌కు ముందు రోజు రాత్రి పార్టీలకు వెళ్లి ఆలస్యంగా నిద్రపోతే మర్నాడు ఇబ్బంది అవుతుందని దర్శకుల అభిప్రాయం. ఇలాంటి సమస్యే ప్రముఖ దర్శకుడు శంకర్‌కు ఎదురయ్యింది. ఆయన ప్రస్తుతం విక్రమ్ కథానాయకుడిగా తమిళ, తెలుగు భాషల్లో ఒక చిత్రాన్ని రూపొందిస్తున్నారు. ఇందులో మదరాసు పట్టణం ఫేం అమీజాక్సన్ హీరోయిన్. బ్రిటన్‌కు చెందిన ఈమె దక్షిణాది చిత్రాల్లో ఎక్కువగా నటిస్తుంది. పాశ్చాత్య సంస్కృతి మూలంగా తరచూ పార్టీలు, విందులకు వెళ్తుంది. ఎక్కువసేపు మేల్కొని ఉండడం, మత్తు పానీయాలు తీసుకోవడం వల్ల తెల్లవారాక సెట్లో అమీ ఇబ్బంది పడుతుందట. లైట్ల వేడికి ఈమె చికాకు పడిపోవడాన్ని గమనించిన శంకర్ తన చిత్రం పూర్తయ్యేవరకు పార్టీలకు వెళ్లకూడదని గట్టిగా చెప్పాడట. మరి అమీ దర్శకుడి మాటను ఏ మేరకు పాటిస్తుందో వేచి చూడాలి.

## ఐటెమ్ పాటలేనా?

హీరోయిన్‌గా అవకాశాలు తగ్గే దశలో ప్రత్యేక గీతాలపై దృష్టి సారిస్తుంటారు హీరోయిన్లు. మాస్ ప్రేక్షకులకు దగ్గరవ్వనే ఈ ప్రయత్నం. ఈ బాటలోనే పయనిస్తుంది ఛార్మి. భలే దొంగలు, మహాత్మా, రగడ చిత్రాల్లో ఐటెమ్ పాటల్లో అలరించిన ఛార్మి నాగార్జున హీరోగా నటిస్తున్న ఢమరుకంలో ఆయనతో కలసి ఐటెమ్ పాటలో నర్తించింది. ఈ పాట చిత్రీకరణ తర్వాత ఈ చిత్రం షూటింగ్ పూర్తయ్యింది. కథరీత్యా విశేష ప్రాముఖ్యమైన పాట కాబట్టి దీనిలో నర్తించానంటుంది ఛార్మి. మనం కాదంటామా?



## మళ్లీ నేహా...



గత కొంత కాలంగా బాలీవుడ్‌లో సెక్సీ భామ నేహాధూపియా పేరు వినిపించడమే లేదు. నేహాను మించిన ఒంపుసొంపులతో విదేశీ భామలు ఆమె స్థానానికి ముప్పు తీసుకొచ్చారు. దాంతో నేహాను పిలిచి అవకాశాలిచ్చే వాళ్లు కరువైపోయారు. ఇంతకాలానికి నేహా మళ్లీ తెరపైకి వచ్చింది. 'సాహెబ్ బీబీ ఔర్ గ్యాంగ్‌స్టర్' కొనసాగింపు చిత్రంలో ఆమె ఓ ప్రత్యేక గీతంలో నర్తించడానికి ఒప్పుకొంది. నేహాతోపాటు సోహా అలీఖాన్, మహీగిల్ తెరపై నాట్యం చేస్తారు. ప్రత్యేక గీతాలలో నర్తించడం తప్పుకాదు. భవిష్యత్తులోనూ ఈ గీతాల్లో నర్తించను అభ్యంతరమేమీ లేదంటుంది నేహా. అవకాశాలు లేనప్పుడు ఏం చేస్తుంది మరి.

## సారొచ్చారు!



మిరపకాయ్ చిత్రంలో హిందీ లెక్చరర్‌గా రవితేజ హిందీ పాఠాలతోపాటు ప్రేమ పాఠాలు చెప్పడం మనం చూశాం. మరోసారి ఆయన గురువు పాత్రలో కనపడనున్నాడు. ఈ చిత్రం పేరు సారొచ్చారు. ఈ సినిమాలో ఆయన ఫుట్‌బాల్ కోచ్‌గా కనిపిస్తాడు. కథ ఫుట్‌బాల్ నేపథ్యంలో నడుస్తుంది. ఇటీవలే యూరప్ దేశాల్లో సన్నివేశాలు, పాటలు చిత్రీకరించారు. కాజల్, రిచా గంగోపాధ్యాయ కథానాయికలు. పరశురామ్ దర్శకత్వం వహించే ఈ చిత్రానికి సి.అశ్వనీదత్ నిర్మాత. పాటలకు దేవిశ్రీప్రసాద్ స్వరాలు సమకూరుస్తున్నాడు.

## పుకార్లు పట్టించుకోను

పుకార్లు అనేవి ప్రముఖుల జీవితాల్లో సాధారణమైపోయాయి. ఈ విషయం తెలియక మొదట్లో కంగారు పడ్డానంటుంది హీరోయిన్ తాప్సి. నా గూర్చి లేనిపోని వార్తలతో దుమారం రేపితే భయపడ్డాను. కానీ ఇప్పుడు అవేవీ పట్టించుకోవడం లేదు. ఎందుకంటే నేను ఏంటో నా కుటుంబసభ్యులకు, స్నేహితులకు బాగా తెలుసు. పుకార్లను పట్టించుకోవడం మానేశానంది. ఈ మధ్య తాప్సి తమిళ నటుడు మహత్‌తో ప్రేమాయణం సాగిస్తుందంటూ పుకార్లు షికారు చేశాయి. ఇటీవల మహత్, మంచు మనోజ్ మధ్య గొడవలకు కారణం తాప్సీయే అన్నారు. కానీ ఈ విషయాన్ని ఆమె ఖండించింది. తెలుగు చిత్రాల్లోనే ఎక్కువగా నటించడానికి కారణాన్ని చెబుతూ ఆశించిన స్థాయి పాత్రలు దక్కుతున్నాయి. తమిళంతో పోల్చుకుంటే తెలుగులో భారీ బడ్జెట్ చిత్రాలు ఎక్కువగా లభిస్తున్నాయంటుంది.



## శిరిడి సాయిని చూడొచ్చు!



చిత్ర సమీక్ష

✍ అల్లూరు రహీం

సాయితత్వం వర్ణనకు మాటలు చాలవు. శిరిడి సాయి ఉదాత్త రూపుడు. అందువల్లే ఆయనను మతాతీతంగా ఆరాధిస్తారు. శిరిడి సాయి చిత్రంలో బాబా చెప్పినట్లు ప్రపంచంలో అన్ని మతాలవారి ఆరాధనా క్షేత్రంగా షిర్డి వెలుగొందినా ఆశ్చర్యపోనక్కరలేదు. సాయిబాబా చరిత్రను ఆయన బతికి వుండగానే హేమండ్ పంత్ వ్రాశారు. సాయి సచ్చరిత పేరిట బాబా భక్తులందరూ దాన్ని నిత్య పారాయణం చేస్తుంటారు. ఈ కథ ఆధారంగా నెల్లూరీయుడు అల్లూరి మహేష్‌రెడ్డి సాయి కృపా ఎంటర్‌టైన్‌మెంట్ లిమిటెడ్ పతాకంపై ఈ చిత్రాన్ని నిర్మించాడు. మహేష్ రెడ్డి కుటుంబీకులంతా షిర్డి సాయికి వీర భక్తులు. ఆయనకు బంగారు సింహాసనం తయారు చేయించిన వదాన్యులు. సాయి భక్తుడు నిర్మాతగా వ్యవహరిస్తున్నారంటే కథకు పైత్యాన్ని జోడించకూడదు. కాని దర్శకుడు కె.రాఘవేంద్రరావు నాగార్జునతో తీసిన అన్నమయ్య, శ్రీరామదాసు చిత్రాల్లో మాదిరి 'సాయి సచ్చరిత' వక్రీకరణకు పూనుకొన్నాడు. దత్తాత్రేయుని ఐదు అంశాలలో ఒక అంశ షిర్డి సాయిగా చెబుతూ మొదలయ్యే కథలో బాల సాయి హిమాలయాలకు వెళ్తాడు. అక్కడ ఆయన హిందూ, ముస్లిం, క్రైస్తవ, బౌద్ధ మత పెద్దలను కలుస్తాడు. ఉద్దండ మహా పిండాలైన వారినే సంస్కరిస్తూ ఒక్కడే సూర్యుడంటూ బోధనకు దిగుతాడు. హిమాలయాలు హిందువులు, బౌద్ధులకు పవిత్ర స్థలం. కాని ముస్లిం, క్రైస్తవులకు వారి మత గ్రంథాల ప్రకారం కనీసం దర్శనీయమైన స్థలం కూడా కాదు. అటువంటప్పుడు ఆ రెండు మతాల పెద్దలు అక్కడెందుకు వుంటారో రాఘవేంద్రరావు సమాధానం చెప్పక తప్పదు. షిర్డి సాయి ప్రస్తుతం షిర్డిలో వున్న భంగిమలో సింహాసనంపై కూర్చొని ప్రాణం విడిచాడని చూపడం కూడా చరిత్రను వక్రీకరించడమే. ఒక సన్నివేశంలో స్వాతంత్ర్యం నా జన్మహక్కు అని నినదించిన బాలగంగాధర్ తిలక్‌కు జాతిపిత మహాత్మాగాంధీ తెలియదని చూపడం ప్రేక్షకుల చెవుల్లో పూలు పెట్టడమే. భక్తి భావ చిత్రంలో హాస్యానికని ఉచ్చ, ముడ్డి, పెంట, చీమిడి అంటూ చంధాలపు మాటలు వ్రాసిన పరుచూరి బ్రదర్స్ చేతులపై బెత్తాలతో కొట్టనవసరం లేదంటారా? అయితే కొన్ని విషయాలలో మాత్రం రాఘవేంద్రరావును మెచ్చుకోవాలి. ఆయన ఒక్కడే సూర్యుడు, ఓం సాయి... శ్రీసాయి, నీ పాదమున ప్రభవించిన, శ్రీరామ జయరామ, సాయి అంటేే తల్లి, పాదం, పిలిస్తే పలుకుతా చరణాలతో సాగే పాటలను అద్భుతంగా చిత్రీకరించాడు. వీటికి సంగీతం సమకూర్చే వరకు బాధ్యతలు కీరవాణి నెరవేర్చి వుంటేే బహుబాగుండేది. ఆయన పాడడానికి సైతం సిద్ధం పడి ఇంకా అద్భుతంగా వచ్చి వుండే ఈ పాటల స్థాయి తగ్గించాడనక తప్పదు. బాబా మహత్యాలు, భక్తులతో మమేకమయ్యే సన్నివేశాలతోపాటు ఆంగ్లేయ దొర వేల్స్ ఆయన కాళ్ల పట్టుకొని ఏసు ప్రభువును మీలో చూస్తున్నానంటూ మొక్కడం వంటి సన్నివేశంలో భావోద్వేగం బాగుంది. పరుచూరి బ్రదర్స్ వ్రాసిన మాటల్లో నిజం అడగడానికి ధైర్యం అక్కరలేదు. సుఖంగా వుండేది మనిషి మరణించాకే. గాలికి, నీటికి, పాతి పెట్టే మట్టికి మతం లేదు. మతం కాదు మనుషులు ముఖ్యం. అహం వదలి ఇహంలో బతకండి. మనిషి శ్వాసలు దేముడే వ్రాస్తాడు ఆలోచింపచేస్తాయి.

చిత్రం ప్రథమార్ధంలో భక్తులను కట్టిపడేసే కనికట్టును ప్రదర్శించిన దర్శకుడు రాఘవేంద్రరావు ద్వితీయార్ధంలో దానిని కొనసాగించలేక పోయాడు. ఉన్నది వున్నట్లు చెప్పుకోవాలంటే షిర్డి సాయి పాత్రను హీరో నాగార్జున గొప్పగా చేయలేకపోయాడు. ఆయన హావ భావ విన్యాసాలు మామూలుగానే సాగిపోయాయి. గంగాభాయిగా రోహిణి హట్టంగడి, రాధాకృష్ణ మాయిగా కమలినీ ముఖర్జీ, దాసుగణుగా శ్రీకాంత్, మహల్సాపతిగా శరత్‌బాబు, తాత్యాగా కౌశిక్‌బాబు, భాటియాగా షాయాజీ షిండే, నానావల్లీగా సాయికుమార్‌తోపాటు బాలసాయిగా నటించిన విజయ్ తమ పాత్రలను అద్భుతంగా పోషించారు. అనంత్, అలీ కామెడీ గలీజుగా తోచినా వేల్సు దొర పాత్ర పోషించిన శ్రీహరి వద్ద దుబాసీగా సందేహం పాత్రలో బ్రహ్మానందం నటన ఆకట్టుకొంటుంది. సాయి చరిత్ర భక్తులందరికీ మనో మందిరాలపై ముద్రితమై వుంటుంది. అందువల్ల కథంటూ దాన్ని ప్రత్యేకంగా ప్రస్తావించడం లేదు. శిరిడి సాయి చిత్రంలో ఎన్ని లోపాలున్నా వాటిని లెక్క చేయకుండా భక్తులు చూసేస్తారు. బాక్సాఫీసు రికార్డులు బద్దలు కొట్టేస్తారు.

# దురాక్రమణలో పంట కాల్వలు!

## చిన్న వర్షానికే రోడ్డుపై నీళ్లు



కాల్వను ఆక్రమించేసి కట్టిన ఇళ్లు.

నగరంలోని పంట కాలువలు రూపురేఖలు కోల్పోతున్నాయి. ఆక్రమణ దారుల చెరచిక్కి, అక్రమ కట్టడాలు వెలుస్తుండడంతో పంట కాలువలు కనుమరుగౌతున్నాయి. వివిధ ప్రాంతాలలో గల పంట కాలువల పరిస్థితి ఇందుకు నిదర్శనం. ప్రధాన కాలువలు ఆక్రమణకు గురై కన్పించకుండా పోతుండడం, ఉప కాలువలు చెత్తాచెదారాలతో నిండి, నీరుపోయే మార్గం లేక పోతుండడంతో మురుగు నీరు బయటకు వెళ్లలేని పరిస్థితి నెలకొంటుంది. నగరంలో 13 ప్రధాన పంట కాలువలు ఉన్నాయి. వీటికి ఉప కాలువలు 20కి పైగా ఉన్నాయి. మల్లప్ప కాలువ, ఉయ్యాల కాలువ, రామిరెడ్డి కాలువ, చల్ల కాలువ తదితర పేర్లతో ఉన్న పంట కాలువల గుండా, ఉపకాలువల గుండా నగరంలోని వివిధ ప్రాంతాల నుంచి నీరు దిగువ భాగానికి ప్రవహిస్తుంటుంది. అయితే గత కొన్ని సంవత్సరాలుగా నగరంలోని పలు ప్రాంతాల్లో దర్జాగా కాలువలు అన్నీ కబ్జాచేసి పక్కా భవనాలు కట్టి వేయడం, అపార్టుమెంట్లు, బహుళ అంతస్తుల భవనాలు నిర్మించడంతో కాలువలు కన్పించనంతగా, రూపురేఖలు కోల్పోయాయి. తూర్పు ప్రాంతమైన ఎసినగర్, బాలాజీనగర్, ఉస్మాన్‌సాహెబ్‌పేట, రామ్మూర్తినగర్, ఆదిత్యనగర్ తదితర ప్రాంతాలలో పంట కాలువలు పూర్తిగా ఆక్రమణలకు గురయ్యాయి. ఇక్కడ కాలువలను ఆక్రమించి యదేచ్ఛగా అపార్టుమెంట్లు సైతం కట్టేశారు. వెంకట్రామాపురం నుంచి వెళ్లే కాలువ పూడిపోయి నీరు వెళ్లే మార్గం లేక పొంగి పొర్లుతోంది. మసీదు సెంటర్, బాలాజీనగర్, ఎసినగర్ మెయిన్ రోడ్డు, లక్కీ బోర్డు సెంటర్‌లో గల వివిధ కాలువలు ఆక్రమణలకు గురై కొన్ని, పూడిపోయి కొన్ని ఉండడంతో కొద్దిపాటి వర్షానికే నీరు రోడ్లపైకి చేరుతున్నాయి. స్థలాలకు లక్షల్లో ధర రావడంతో ఆక్రమణదారులు పంట కాలువలను కబ్జాచేసి నిర్మాణాలు చేపడుతున్నా సంబంధిత శాఖ అధికారులు తమకేమీ పట్టనట్లు వ్యవహరిస్తుండడంతో పంట కాలువలు కనుమరుగై పోతున్నాయి.

# అక్రమాలలో వివేకా పాత్ర కీలకం!

**• కోటంరెడ్డి శీనయ్య ఆరోపణ**

నగరంలో ఏ అక్రమం జరిగినా, ఏ అవకతవకలు జరిగినా వాటన్నింటిలో రూరల్ శాసన సభ్యుడు ఆనం వివేకానందరెడ్డి పాత్ర కీలకమని తెలుగుదేశం పార్టీ నేత కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి ఆరోపించారు. ఇలాంటి వాటన్నింటిలో వివేకా హస్తం ఉందన్నారు. తెలుగుదేశం పార్టీ జిల్లా కార్యాలయం ఎన్టీఆర్ భవన్‌లో జరిగిన విలేకరుల సమావేశంలో ఆయన వివేకానందరెడ్డిపై విరుచుకపడ్డారు. తెలుగుదేశం పార్టీ కార్యకర్తలు ప్రాణాలకు తెగించి పెద్దాసుపత్రి బ్లడ్ బ్యాంక్ నుంచి అక్రమంగా తరలించుకొని పోతున్న బ్లడ్ ప్యాకెట్లను పట్టుకొంటే అభినందించాల్సిందిపోయి తమ వారిపైనే అవాకులు చెవాకులు మాట్లాడడం వివేకానందరెడ్డి దిగజారుడుకు నిదర్శనం అన్నారు. ఈ బ్లడ్ ప్యాకెట్‌ల తరలింపులో చాలా మంది పెద్దల పాత్ర ఉందని అనుమానం వ్యక్తం చేశారు. ఈ ఘటన జరిగిన తర్వాత ఆ ప్రదేశంలో, బ్లడ్ బ్యాంక్ వద్ద మాజీ మేయర్ భానుశ్రీ సోదరుడు తిరుగుతున్నాడని, అతనికి అక్కడ పనేమిటని ప్రశ్నించారు. వీటన్నింటినీ చూస్తుంటే పలు అనుమానాలు తలెత్తుతున్నాయన్నారు. నిందితులను పట్టుకొంటే వారిపై బలమైన కేసులు పెట్టకుండా నీరుగారుస్తున్నారన్నారు. ఆనం వివేకానందరెడ్డి మునిసిపాలిటీని నాశనం చేశారని, పోలీస్ వ్యవస్థను నిర్వీర్యం చేశారని కిలారి వెంకటస్వామి నాయుడు విమర్శించారు. బ్లడ్‌బ్యాంక్ అక్రమాలపై, రక్తనిల్వల తరలింపుపై సమగ్ర విచారణ జరిపించాలని, నిజానిజాలు నిగ్గుతేల్చాలని డిమాండ్ చేశారు.

## క్యాన్సర్ హాస్పిటల్‌కు పది లక్షలు



నెల్లూరు పొదలకూరురోడ్డులో ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ నేతృత్వంలో నడిచే క్యాన్సర్ హాస్పిటల్‌లో నిర్మిస్తున్న సర్జికల్ బ్లాక్‌కు భగవాన్ మహావీర్ జైన్ చారిటబుల్ ట్రస్ట్ పది లక్షల రూపాయల విరాళాన్ని అందించింది. ట్రస్ట్ సభ్యులు ప్రకాష్, చంపాలాల్, వినోద్ జైన్ ఈ మేరకు చెక్‌ను క్యాన్సర్ హాస్పిటల్ కన్వీనర్ తుంగా శివప్రసాద్‌రెడ్డికి అందజేశారు. మహావీర్ జైన్ చారిటబుల్ ట్రస్ట్ ప్రస్తుతం అందించిన విరాళం ఐదవ విడతది. గతంలో నాలుగు పర్యాయాలు వాళ్లు క్యాన్సర్ ఆసుపత్రిలో సర్జికల్ వార్డు నిర్మాణానికి విరాళమిచ్చారు.

## ఉత్తమ ఉపాధ్యాయులకు సన్మానం

**మంచి పనిచేసిన వాకర్స్ అసోసియేషన్**



సన్మానించిన ఉపాధ్యాయులతో వాకర్స్ అసోసియేషన్ సభ్యులు.

నెల్లూరు రంగనాయకులపేటలోని సెయింట్ పీటర్స్ వాకర్స్ అసోసియేషన్ ఉపాధ్యాయ దినోత్సవాన్ని పురస్కరించుకొని ముగ్గురు ఉపాధ్యాయులను సన్మానించింది. ప్రకాష్‌రెడ్డి, నబీవుల్లా, మారుతీప్రసాద్‌లను అసోసియేషన్ అధ్యక్షుడు కె.వెంకటేశ్వరరావు, కార్యదర్శి దరిశి నరసింహారావు, సభ్యులు రాజారావు సన్మానించారు.

## విద్యుత్ కోతలను నిరసిస్తూ...

# రమేష్‌రెడ్డి కాగడాల ప్రదర్శన



ట్రంకురోడ్డులో కాగడాల ప్రదర్శన.(ఇన్‌సెట్‌లో ఎన్టీఆర్ విగ్రహం చేతికి దివిటీ).

ఆనం సోదరుల ఇంటికి నిరంతరం విద్యుత్తు సరఫరా చేయడాన్ని నిరసిస్తూ తెలుగుదేశం పార్టీ ఆధ్వర్యంలో కాగడాల ప్రదర్శన నిర్వహించారు. గాంధీ బొమ్మ సెంటర్ నుంచి ప్రారంభమైన కాగడాల ప్రదర్శన ఎసి సెంటర్ మీదుగా నర్తకి సెంటర్ వరకు సాగింది. అనంతరం ఎన్టీఆర్ విగ్రహానికి పూలమాలలు వేసి నివాళులర్పించారు. ఈ సందర్భంగా టిడిపి నేతలు కోటంరెడ్డి శ్రీనివాసులు రెడ్డి, తాళ్లపాక రమేష్‌రెడ్డిలు మాట్లాడారు. గతంలో ఎన్నడూలేని విధంగా విద్యుత్ సరఫరా చేయడంలో ప్రభుత్వం వైఫల్యం చెందిందన్నారు. తెలుగుదేశం పార్టీ హయాంలో విద్యుత్ సరఫరా బాగుందని చెప్పారు. కాంగ్రెస్ అసమర్థ పాలన కారణంగా ప్రజలు కష్టాలు భరించక తప్పడం లేదన్నారు. ఆనం సోదరుల ఇళ్లకు మాత్రం 24 గంటలు విద్యుత్ సరఫరా చేస్తున్న అధికారులు నగరంలోని అన్ని ప్రాంతాలకు కూడా సరఫరా చేయాలని డిమాండ్ చేశారు. అధికారులు స్పందించలేకపోతే మంత్రి ఆనం రామనారాయణరెడ్డి నివాసం ఎదుట ధర్నా చేస్తామని హెచ్చరించారు. ఈ కార్యక్రమంలో టిడిపి నేతలు కిలారి వెంకటస్వామి నాయుడు, నూనె మల్లిఖార్జున యాదవ్, భువనేశ్వర ప్రసాద్, ధర్మవరపు సుబ్బారావు తదితరులు పాల్గొన్నారు.



షార్‌కు వచ్చిన ప్రధాన మంత్రి మన్మోహన్‌సింగ్‌కు జిల్లా సమస్యలపై వినతిపత్రం ఇస్తున్న ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి. మధ్యలో జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి పితాని సత్యనారాయణ.



నెల్లూరు పొగతోటలోని ప్రభవ తొలిబడిలో జరిగిన ఉపాధ్యాయ దినోత్సవంలో ఉపాధ్యాయుల వేషధారణలో పిల్లలు.

## తెలంగాణ ఉద్యమం

మొదటి పేజీ కొరవ

పెంచింది. తెలంగాణ ఇవ్వకుంటే కాంగ్రెస్‌కు భవిష్యత్తు వుండదన్న నిజం అందరికీ తెలుసు. దాన్ని కనిపెట్టుకొంటే రాజకీయంగా భూస్థాపితం క్రిందే లెక్క. అట్లని టిఆర్‌ఎస్‌తో చేతులు కలిపితే కెసిఆర్ క్రింద బానిసల వలె బ్రతకాలి. ఈ దుర్గతి కంటే, ప్రజలలో ఎంతో కొంత అభిమానం వున్న జగన్ పార్టీలోకి సామూహికంగా వెళ్లి పోవడమే మేలన్న ఆలోచన వీరిలో తీవ్రంగా నడుస్తున్నది.

ఇది తెలంగాణ వాదులను కలవర పరుస్తున్నది. జగన్ ఇప్పటివరకు సమైక్యవాదిగానే వున్నాడు. తెలంగాణ అనుకూల ప్రకటనలకు కూడా ఇష్ట పడడం లేదు. ప్రజలలో ఎంతో కొంత పలుకుబడి వున్న ప్రధాన కులం మొత్తం జగన్‌తో కలిస్తే, రేపటి ఎన్నికలలో ప్రమాదకర ఫలితాలు వస్తాయ న్నది ఉద్యమకారుల భయం. జగన్ పార్టీ గణ నీయమైన సంఖ్యలో స్థానాలు గెలుచుకొంటే ఇక తెలంగాణ ఉద్యమం అనేది మిగలదు. దాన్ని మళ్లీ బ్రతికించడం దాదాపు అసాధ్యం. అందువల్ల రెడ్డి జన సమాజంలో రేకెత్తుతున్న కెసిఆర్ వ్యతిరేక భావాలు ఉద్యమానికి శరాఘాతాలుగా మారకుండా జాగ్రత్త పడాలని తలపోస్తున్నారు మేధావులు.

కానీ కెసిఆర్ మాత్రం ఇవేమీ పట్టించుకోవడం లేదు. ఢిల్లీ నేతలు తనకు మాట ఇచ్చారని, తెలంగాణ ఇస్తారనే గట్టిగా చెప్తున్నాడు. ఆ సాకుతో ఉద్యమ కార్యక్రమాలను పక్కన పెట్టి సుఖంగా విశ్రాంతి తీసుకొంటున్నాడు.

## విజయమ్మ

మొదటి పేజీ కొరవ

ఛానళ్లు రెచ్చిపోయి ప్రసారం చేశాయి. పిటిఐ విలేకరి సీనియారిటీ తెలియని జూపూడి ప్రభాకర్ రావు వంటి జగన్ పార్టీ నేతలు మా విజయమ్మ అటువంటి మాట చెప్పలేదని బుకాయించారు. కానీ ఆ ప్రక్క రోజే విజయమ్మ కంఠ స్వరంతో కూడిన ఆడియో క్లిప్లింగ్‌ను యూ ట్యూబ్‌లో పెట్టింది పిటిఐ వార్తా సంస్థ. దానితో జగన్ పార్టీ సమస్తం అయోమయంలో పడిపోయింది.

ఇప్పటికే జగన్, కాంగ్రెస్ పెద్దలతో రాజీకి సిద్ధపడుతున్నాడన్న వార్తలు లేదా వదంతులు విస్తృతంగా వ్యాప్తిలో వున్నాయి. వాటిని విజయమ్మ మాటలు ధృవపరచినట్లు అయ్యిందిప్పుడు. జగన్ కాంగ్రెస్‌తో ఒకవేళ చర్చలంటూ జరిపితే విజయమ్మకు తెలియకుండా జరగవు. ఆయన జైలులో వున్నాడు కాబట్టి, బయట ఏ చిన్న కదలిక అయినా తన తల్లితో సంప్రదించే చేయాలని ఆంక్ష పెట్టి వున్నాడు జగన్. దాన్నిబట్టి చూస్తే, జగన్‌కు కాంగ్రెస్‌కు మధ్య రాజీ చర్చలనేవి నిజం కాబట్టి, విజయమ్మ అట్లా మాట్లాడిందనే అనుమానం కలుగుతున్నది. ఆమె మనసులో అటువంటి ఆలోచనలు లేకుంటే, కాంగ్రెస్‌తో విలీనం మాట రాగానే లేదు, కాదు అని ఖండించాలి కదా? ఏది ఏమైనా విజయమ్మ తనకు తెలియకుండానే నోరు జారి బయట పెట్టిన ఈ చిన్న మాట జగన్ పార్టీని చాలా ఇబ్బంది పెడుతున్నది. ఆమె పిటిఐ విలేకరితో మాట్లాడేటప్పుడు పక్కనే మేకపాటి రాజమోహన్‌రెడ్డి, శోభా నాగిరెడ్డి వున్నారు. వారైనా ఆ విలేకరి ఉద్దేశాన్ని గమనించి, విజయమ్మను నిగ్రహించి వుంటే ఈ ప్రమాదం తప్పేది.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### ర్యాగింగ్ చేస్తే క్రిమినల్ కేసులు!

జిల్లాలోని ఏ కళాశాలలోనైనా విద్యార్థులు, ఆకతాయిలు ర్యాగింగ్ చేస్తే వారిపై క్రిమినల్ కేసులు నమోదు చేయాలని వివిధ కాలేజి ప్రిన్సిపాళ్లను జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం కోరారు. కలెక్టరేట్‌లోని గోల్డెన్ జూబ్లీ హాల్‌లో ఆయన నేతృత్వంలో జరిగిన సమీక్షా సమావేశంలో మాట్లాడుతూ జిల్లాలోని కొన్ని ఇంజనీరింగ్ కాలేజీల్లో ర్యాగింగ్ జరుగుతోంది. ఇలాచేసే వారి ఫలితాలను నిలిపి వేయండి. చట్ట ప్రకారం జైలుకు పంపండని జెసి చెప్పారు.

### ఉచిత వైద్య శిబిరం

నెల్లూరు పెద్దబజారులోని యాహ్యాలివీధిలోని ఎన్ఎండి చారిటబుల్ ట్రస్ట్ నేతృత్వంలో 9వ తేది స్త్రీ గర్భకోశ వ్యాధిగ్రస్తులకు ఉచిత వైద్య శిబిరం జరిగింది. డాక్టర్ తనూజ 50 మంది మహిళలను పరీక్షించి ఉచితంగా మందులు పంచిపెట్టారు. చారిటీస్ ఛైర్మన్ నిజాముద్దీన్, సభ్యులు షేక్ నజీర్, కె.మాధవ్, షాహిద్దీన్, ఉమర్, జహీర్, ఖలీద్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.



### ఉపాధి కూలీలకు ఇచ్చిన నోట్లపై సందేహం!

ఉపాధి హామీ కూలీలకు నకిలీ నోట్లు అందజేయడం కలకలం రేపింది. ఉదయగిరి మండలంలోని ఉపాధి కూలీలకు దుత్తలూరు సబ్ పోస్టాఫీసు నుంచి అధిక మొత్తంలో డబ్బులు డ్రాచేసుకొని వాటిని కూలీలకు వారికి రావాల్సిన దామాషా ప్రకారం అందజేశారు. వెయ్యి రూపాయల నోట్లు అందుకొన్న వాళ్లు సామాన్లు కొనేందుకు అంగళ్లకు వెళ్లగా అవి దొంగనోట్లని చెప్పడంతో అవాక్కయిన కూలీలు అధికారులకు సమాచారం అందించారు. దీనిపై పోలీసులకు తెలపడంతో వారు విచారించి నకిలీ నోట్లుకాదని నిర్ధారించారు.

### ప్రధాని సైకత శిల్పం

శ్రీహరికోటకు ప్రధాని మన్మోహన్‌సింగ్ రాక సందర్భంగా చిల్లకూరు మండలానికి చెందిన సనత్ కుమార్ ఆయన సైకత శిల్పాన్ని రూపొందించాడు. ప్రధానితోపాటు పిఎస్ఎల్‌విసి-21 నమూనాను సైతం ఇసుకతో తయారు చేయడంతో అవి పలువురిని ఆకట్టుకొన్నాయి. చిల్లకూరు సిలికా గనుల వద్ద వీటిని భారీగా రూపొందించడంతో వాటిని చూసేందుకు చుట్టుప్రక్కల ప్రాంతాల వాళ్లు అధిక సంఖ్యలో తరలి వచ్చారు.



నెల్లూరు చిన్నబజారులోని మోహన్‌రెడ్డి జ్యూయలర్స్‌లో లక్కీడీప్ కార్యక్రమానికి విచ్చేసిన వ్యవసాయశాఖ అసిస్టెంట్ డైరక్టర్ సిహెచ్.రవిచంద్రప్రసాద్‌ను స్వాగతిస్తున్న జ్యూయలర్స్ అధినేత మోహన్‌రెడ్డి.

## న్యాయవాది గుమస్తాల సంఘం

నెల్లూరు జిల్లా న్యాయవాది గుమస్తాల సంఘం నూతన కార్యవర్గ ఎన్నికలు ఇటీవల జరిగాయి. గౌరవాధ్యక్షునిగా గుళ్లపల్లి సత్యనారాయణ, అధ్యక్షునిగా అన్నవరం సత్యనారాయణ, కార్యదర్శిగా ఎస్.తిరుపాలు, కోశాధికారిగా టి.సుధాకర్ ఎన్నికయ్యారు. కార్యవర్గ సభ్యులుగా జి.శ్రీనివాసులు, బి.సుధాకర్‌రావు, జి.మురళి, షేక్ మీరా మొహియుద్దీన్, వి.ఆంజనేయులను ఎన్నుకొన్నారు.

## నకిలీల విచారణకు బృందాలు

హిందీ పండిట్లలో నకిలీ సర్టిఫికేట్ల పరిశీలనకు విద్యాశాఖ మూడు బృందాలను ఏర్పాటు చేసింది. డిప్యూటీ డిఇఓ ప్రసన్నాంజనేయులు ఆధ్వర్యంలో పలువురు ఎంఇఓలు, ప్రధానోపాధ్యాయులతో కూడిన ఈ బృందంలోని వారు ఉత్తరప్రదేశ్, తమిళనాడు, హైదరాబాద్ తదితర ప్రాంతాలకు వెళ్లి అక్కడ కోర్సు చేసినట్లు ఇచ్చి ఉన్న ఉపాధ్యాయుల సర్టిఫికేట్లను పరిశీలన జరిపి నకిలీవో, అసలైనవో నిర్ధారించనున్నారు. ఇప్పటికే ఏళ్లు పూళ్లు పట్టిన సర్టిఫికేట్ల విచారణ ఇంకెప్పటికి పూర్తవుతుందో?

## బాలుడికి డెంగ్యూ

ఇందుకూరుపేట మండలం ఆదెమ్మసత్రంకు చెందిన మోహన్ అనే నాలుగేళ్ల బాలుడికి డెంగ్యూ వ్యాధి లక్షణాలు ఉన్నట్లు అనుమానించి చికిత్స అందిస్తున్నారు. స్థానికంగా చూపించగా వారు ఆ బాలుడిని నెల్లూరులోని రేబాలవారి చిన్నపిల్లల ఆస్పత్రికి తరలించి వైద్య చికిత్స అందిస్తున్నారు. వైద్య పరీక్షలు నిర్వహించిన డాక్టర్లు మోహన్ రక్తంలో తెల్లరక్తకణాలు తక్కువగా ఉన్నట్లు గుర్తించి డెంగ్యూ అనుమానంగా నమోదు చేశారు. ఆదెమ్మ సత్రం ఎస్టీ కాలనీలో పారిశుద్ధ్యం క్షీణించడమే ఇలాంటి వ్యాధులకు కారణంగా గ్రామస్తులు ఆరోపిస్తున్నారు.

## దేగపూడి హజరత్‌రెడ్డి మరణం!

జగదేవిపేట వాసి, సీలేరు ప్రాజెక్ట్ నిర్మాణ కాంట్రాక్టర్‌గా అందరికీ సుపరిచితుడైన దేగపూడి హజరత్‌రెడ్డి(75) 2వ తేది హైదరాబాద్‌లో మరణించారు. ఆయనకు భార్య, కుమార్తె, కొడుకు ఉన్నారు.

## అల్లారెడ్డి జయలక్ష్మమ్మ మరణం



సవేరా గ్రూప్ ఆఫ్ హోటల్స్ అధినేత దివంగత అల్లారెడ్డి శ్యామ సుందరరెడ్డి సతీమణి జయలక్ష్మమ్మ 9వ తేది చెన్నైలో మరణించారు. ఆమెకు ఇద్దరు కుమారులు.

ఆత్మీయులను కోల్పోయిన పై రెండు కుటుంబాల వారికి మా సానుభూతి.

## జనవాణి

2వ పేజీ కొరవ

కల్‌తో పోటీ పడలేక పోయినందువల్ల రామోజీరావుకు ఆ పత్రిక అంటే కసి అని వ్రాశారు. ఆయనకు ఎదురైన ఏకైక పరాజయం అదే అని కూడా పేర్కొన్నారు. వాస్తవానికి రామోజీరావు తనకు అన్ని విధాల స్థిరత్వం కోసం ఇంగ్లీషులో ఒక దినపత్రిక ఉండడం మంచిదని భావించే న్యూస్‌టైమ్‌ని ప్రారంభించారు. కాని దానిని వృద్ధి చేయాలన్న తలంపు మాత్రం ఆయనకు లేదు. ఆయన దృష్టంతా ఈనాడు పైనే కేంద్రీకృతమై వుండేది. కాబట్టి న్యూస్‌టైమ్ మూతపడడం అన్నది ఆయన కావాలని చేసిందే తప్ప మరొకటి కాదు. సాక్షిపత్రిక ఈనాడును మించడానికి ఇతర కారణాలు తప్ప పోటీ అసలు కాదు. రామోజీరావు ఏకైక వైఫల్యం అంటూ చెప్పుకోవలసి వస్తే 1984లో ప్రియా ఫుడ్ ప్రొడక్ట్స్ నుంచి వచ్చిన 'సోమ' అనే కూల్‌డ్రింక్ జనాదరణ పొందకపోవడం ఆయన్ను తీవ్రంగా నిరాశపరచిందని అంతర్గత సమీక్షల్లో చెప్పుకోవడం విన్నవాళ్లు చెబుతుంటారు.

పి.ప్రకాష్ హైదరాబాదు

### అస్సాంపై ప్రత్యేక వ్యాసం బాగుంది!

ఆగష్టు 24వతేది 'జమీన్‌రైతు' పత్రికలో అస్సాంలో మానవ విషాదం శీర్షికన ప్రచురితమైన వ్యాసం బాగుంది. ఇక్కడ ఏమి జరిగిందో, జరుగుతుంతో సూటిగా విశదంగా వ్రాసిన తీరు అభినందనీయం. ఇటువంటి వ్యాసాలు 'జమీన్‌రైతు' పాఠకులకు అన్ని వ్యవహారాలు తెలిసేలా చేస్తాయి.

వి.విజయలక్ష్మి గూడూరు

## పదరంగం -33

నిర్వహణ : బాబాజీ



**అడ్డం**

1. పంచతంత్ర కథలలోని నక్కల జంట (9)
6. ఏప్రెలు తర్వాతి నెల (1)
7. వంద (2)
8. అన్ని అవయవాలు వీటి నిర్మాణమే (2)
11. స్వప్నము (2)
13. రాజశేఖర్, సుమలత, షణ్ముఖ శ్రీనివాస్‌ల విశ్వనాథ్ సినిమా (5)
14. ....... కాని చోట అధికుల మనరాదు (3)
17. పుష్పాలు (3)
18. పుణ్యాలకు వ్యతిరేకాలు (3)
20. చేతి గుడ్డే తడబడింది (3)
21. వెనుక నుంచి... మన్మథుని భార్యామణి (2)
23. తెలుగు పర్సంటేజి (3)
25. అటు నుంచి ఫలసాయం (2)
26. తెలంగాణ పిలగాడు (4)
28. అటు నుంచి రుచి, టేస్ట్ (2)
29. రోలుకు జతగాడు (3)
30. తడబడిన కలువ (3)
31. అలవాటు, సాంప్రదాయం (3)
32. బరువు, గౌరవం (3)

**నిలువు**

1. చెల్లాచెదురు అవడం (5)
2. క్రింద నుంచి తెలుగు సాంగ్స్ తడబడ్డాయి (3)
3. చివరలో 'కం'గల పది (3)
4. తెలుగు రెలిజియన్ (2)
5. ఎటు నుంచైనా నిద్రే (3)
9. కన్నీళ్ళు (4)
10. క్రింద నుంచే అలగడం (3)
12. క్రింద నుంచే ఒక చర్మ వాయిద్యం (3)
14. రేర్‌గా లభించేది విశిష్టమైనది (4)
15. తిలలు (3)
16. శపించడాలు క్రింద నుంచే (3)
19. కవి వ్రాసిన పద్యాలు క్రింద నుంచి (4)
20. ఎక్కువ మాట్లాడే వాడు (4)
21. పాతకాలపు గ్రైండర్ చివర్లో తడబడింది (4)
22. క్రింద నుంచి పంటి మీద చార, రంగు (2)
24. రక్షణ తొడుగు క్రింద నుంచి (4)
26. వక్క, రాకకు వ్యతిరేకం (2)
27. నీటిగుంట తడబడింది క్రింద నుంచి (3)
29. దినం, తెలుగు డే (2)
30. క్రింద నుంచి అడ్డం 38కి జతగత్తె (2)

### సమాధానాలు

## పదరంగం -32

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1త | టి | ల్ల | 2త | | 3పా | 4కం | | 5మ | గ | డు |
| ర | | 6జె | ల | 7సీ | | డ్ల | | రీ | | |
| 8వా | సు | కి | | 9కా | య | క | ల్ప | చి | 10కి | త్స |
| ణి | | 11టెం | కా | య | | ల | | 12క | రి | |
| | 13తే | | | 14పొ | ర | క | లు | | 15కి | ట్టా |
| 16మె | రు | 17పు | | డి | | | | | రి | |
| కం | | రం | | | | 18వా | 19రే | 20వా | | 21కొ |
| | 22అ | ధ | ము | డు | | | 23పు | రి | కొ | స |
| 24అ | క్క | ర | | | 25ప | 26చే | | జా | | మె |
| స | న్న | 27దా | | | 28ని | ట | లా | క్షు | | రు |
| త్తు | | 29సు | న్నుం | డ | | లు | | లు | సు | 30పు |

# సంక్షిప్త సింహపురి

## ఫ్యామిలీ కోర్టు జడ్జి బదలీ

నెల్లూరు నగరంలోని న్యాయవాదులందరీ అభిమానం చూరగొన్న ఫ్యామిలీ కోర్టు జడ్జి జి.చక్రధర్‌రావును ప్రకాశం జిల్లా జడ్జిగా బదలీ చేశారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని నెల్లూరు బార్ అసోసియేషన్ నేతృత్వంలో ఆయన అభినందన సభ ఇటీవల జరిగింది. ఈ సభలో సీనియర్ న్యాయవాది ఓ. అబ్బాయ్‌రెడ్డి మాట్లాడుతూ కుటుంబ కలహాలతో ఫ్యామిలీ కోర్టుకు వచ్చిన అత్యధిక జంటలతో ముచ్చటించి వాళ్ళ మళ్లీ కలసి జీవించేలా చక్రధర్‌రావు చర్యలు తీసుకొని కోర్టు చరిత్రలో గుర్తుంచుకోతగ్గ న్యాయమూర్తి అయ్యారన్నారు. మరో న్యాయవాది నన్నే సాహెబ్ మాట్లాడుతూ ఫ్యామిలీ కోర్టుకు వెళ్లాలని న్యాయవాదులు ఉత్సుకత చూపడానికి చక్రధర్ వ్యవహారశైలినే కారణమన్నారు. జిల్లా జడ్జి ఎల్.శ్రీరామమూర్తి కూడా ఈ అభినందన సభలో పాల్గొనడంతోపాటు చక్రధర్‌రావు తన చిరకాల మిత్రుడని, మృదుస్వభావని ప్రశంసించారు. ఈ సభకు పెద్దసంఖ్యలో న్యాయవాదులు హాజరవ్వడం విశేషం.

## అటవీశాఖకు ఆదాయం



జిల్లాలోని అటవీ శాఖాధికారులు వివిధ కేసుల్లో స్వాధీనం చేసుకున్న వాహనాలను వేలం వేశారు. వివిధ మోడళ్ల 90 వాహనాల విక్రయానికి టెండరు పద్ధతిలో వేలం నిర్వహించగా 75 వాహనాలకు మాత్రమే 395 టెండర్లు దాఖలు చేశారు. దాఖలయ్యాయి. ఈ టెండర్ల ద్వారా అటవీశాఖకు 40.7లక్షల రూపాయల ఆదాయం లభించిందని జిల్లా అటవీశాఖాధికారి నాగేశ్వరరావు చెప్పారు. ఈ కార్యక్రమంలో డిఎఫ్ఓలు బాలచంద్రారెడ్డి, భాస్కర్‌రావు, నెల్లూరు రేంజర్ మారుతీ ప్రసాద్ పాల్గొన్నారు.

## ఉపాధ్యాయ దినోత్సవం

నెల్లూరు పొదలకూరురోడ్డు జడ్పీ కాలనీలోని శమంత్ స్కూల్‌లో ఉపాధ్యా దినోత్సవం 5వతేది ఘనంగా జరిగింది. ఈ సందర్భంగా పాఠశాల కరస్పాండెంట్ డి.రజనీకాంత్ మాట్లాడుతూ డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ అత్యద్భుత గుణగణాలు కల్గిన ఉపాధ్యాయుడని, ఆయన గొప్పదనానికి గుర్తుగా ఉపాధ్యాయ దినోత్సవం జరుపుకోవడం ఆనందకరమన్నారు. పిల్లలకు వ్యాసరచన వ్యక్తృత్వ పోటీలతోపాటు ఉపాధ్యాయుల మధ్య కూడా వివిధ రకాల ఆటలు, పాటల పోటీలు నిర్వహించారు. విజేతలకు బహుమతులతోపాటు అందరికీ మిఠాయిలు పంచిపెట్టారు.

## నగరాభివృద్ధికి రూ.180కోట్లు!



గత ఐదేళ్ల వ్యవధిలో నెల్లూరు నగర పరిధిలో 180 కోట్ల రూపాయల అభివృద్ధి పనులు చేపట్టినట్లు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి చెప్పారు. జ్యోతినగర్ మొదటి వీధిలో సిమెంటురోడ్డుకు శంకుస్థాపన చేసిన వివేకానందరెడ్డి మాట్లాడుతూ 26వ డివిజన్‌లో కోటీ76లక్షల రూపాయలతో ఇప్పటి వరకు అభివృద్ధి పనులు చేశామన్నారు. ఈ సభలో మరో 10 లక్షలతో ఈ డివిజన్‌లోనే మరికొన్ని అభివృద్ధి పనులు చేస్తామన్నారు. ఆకస్మాత్తుగా మాజీ జడ్పీఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డిని వివేకానందరెడ్డి విమర్శించారు. ఆనం సోదరుల కాళ్లు పట్టుకొని జడ్పీఛైర్మన్ అయిన ఆయన మమ్మల్ని విమర్శించడాన్ని ప్రజలు గమనిస్తున్నారని తగిన సమయంలో ఆయనకు బుద్ధి చెబుతారన్నారు.

## రక్తనిధిలో అవినీతిని ఛేదిస్తాం!



నెల్లూరు పెద్దాసుపత్రి రక్తనిధిలో రక్తం మాయం చేస్తున్న స్కామ్ వెనుక ఎంత పెద్ద వారున్నా ఛేదించి నిందితులకు శిక్షపడేవరకు పోరాటం చేస్తామని తెలుగుదేశంపార్టీ నగర అధ్యక్షుడు కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి హెచ్చరించారు. ఈ విషయమై విలేకరులతో మాట్లాడుతూ కాంగ్రెస్ ప్రభుత్వ హాయంలో ఇసుక, మద్యం, మైనింగ్, పాలు కల్తీ మాఫియాలు రక్తనిధి వరకు ప్రాకడం దురదృష్టకరమన్నారు. ప్రభుత్వాసుపత్రిలో ఇంత పెద్ద స్కామ్ జరిగితే బాధ్యులపై చర్యలు తీసుకోకుండా బ్యాగులు మోసేవారిపై కేసులు నమోదు చేయడం దారుణమన్నారు. రక్తం స్కామ్‌లో అధికార పార్టీ నేతలకు సంబంధం వుందని శ్రీనివాసులురెడ్డి ఆరోపించారు. నగరంలో జరిగే అవినీతి అక్రమాలను తెలుగుదేశం కార్యకర్తలు ముందుండి అడ్డుకొంటారనేదానికి రక్తం ప్యాకెట్లు అక్రమ రవాణా చేస్తున్న వారిని పట్టుకోవడమే నిదర్శనమన్నారు.

## రైతు లోకం

# వేరుశనగలో కాండం కుళ్లు తెగులు - నివారణ!

వేరుశనగలో కాండం కుళ్లు తెగులు జిల్లాలో అక్కడక్కడా గమనించటం జరిగింది. ఈ తెగులును బూజు తెగులు లేక బుడిమ తెగులు అని కూడా అంటారు. ఈ తెగులును కలుగజేసే శిలీంధ్రం భూమి ద్వారా, విత్తనం ద్వారా వ్యాపిస్తుంది. ఈ తెగులు పంట వేసిన తర్వాత సుమారు 70వ రోజు నుండి పంట చివరి వరకు అగుపిస్తుంది. తెగులు ఆశించటం వల్ల ప్రారంభ దశలో మొక్క మొదలులో వున్న శాఖలు పసుపు వర్ణానికి మారి ఎండిపోతాయి. తర్వాత భూమిపై వున్న కాండం మీద తెల్లటి బూజు, తెరలుగా ఏర్పడుతుంది. ఈ తెల్లటి బూజులో ఆవగింజ పరిమాణంలో వున్న శిలీంధ్ర సిద్ధబీజాలు ఏర్పడతాయి. ఊడలు, కాయలు కూడా ఈ తెగులుకు లోనవుతాయి. కాయలోని గింజలపై నీలి, బూడిద రంగు మచ్చలు ఏర్పడతాయి. ఈ తెగులు ఆశించిన మొక్కలను పీకినప్పుడు నేలపై వున్న మొక్క భాగాలు మాత్రమే ఊడి వస్తాయి. వేర్లు, కాయలు నేలలోనే వుండిపోతాయి.

### నివారణా పద్ధతులు

దీని నివారణకు వేసవిలో లోతు దుక్కులు చేసుకోవాలి. సజ్జ, జొన్న వంటి పంటలతో పంట మార్పిడి చేయాలి. సేంద్రీయ ఎరువులను పొలంలో వేసి కలియ దున్నాలి. కిలో విత్తనానికి ఒక గ్రాము కార్బెండజిమ్ లేదా మూడు గ్రాముల మ్యాంకోజెబ్ కలిపి విత్తన శుద్ధి చేయాలి. రెండు కిలోల ట్రైకోడెర్మా విరిడి ఫార్ములేషన్‌ను 90 కిలోల పశువుల ఎరువు మరియు 10 కిలోల వేపగింజల పిండితో కలిపి, పాలిథిన్ కాగితంతో కప్పి 3 రోజుల కొకసారి నీళ్లు చల్లుతూ, 15 రోజుల తర్వాత ఒక ఎకరా భూమిలో విత్తే ముందు వేసుకోవాలి. పొలంలో తెగులు సోకిన మొక్కలు గమనించిన వెంటనే ఒక గ్రాము కార్బెండజిమ్ లేదా 2 మిల్లీలీటర్లు హెక్సాకోనజోల్ లీటరు నీటికి చొప్పున కలిపి మొక్కల మొదళ్లకు పడేటట్లు పిచికారీ చేయవలెను.



డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/12-14

## ● కోటిన్నర కుటుంబాలలో

# దీపం వెలిగించిన కురియన్!



స్వాతంత్ర్యం వచ్చిన తొలిరోజులు. భారతీయుల జీవన ప్రమాణాలు మెరుగుపరచాలనే ఆతృత, ఆకాంక్ష, ఆరాటం జాతి నేతలందరిలోనూ ముప్పిరిగొంటున్న సమయం. ఆనాటికి భారతదేశం అంటే గ్రామాల సముదాయం మాత్రమే. ఏ మెరుగు అయినా అక్కడే రావాలి. వ్యవసాయ అనుబంధ రాబడి పెంచితే తప్ప కోట్లాది గ్రామీణ పేదల ఆర్థిక పరిస్థితి మెరుగుపడదని అప్పటికే గాంధీగారు స్పష్టంగా నిర్దేశించారు. పాల ఉత్పత్తి అందుకొక మార్గం. కానీ పాల నిల్వకు దేశంలో సదుపాయాలు లేవు. కండెన్స్‌డ్ పాలు, పాల పొడి తయారు చేస్తేనే వర్షాకాలంలో మిగులు, ఎండాకాలంలో కొరత అధిగమించి రైతులకు గిట్టుబాటు ధర కల్పించవచ్చు. జవహర్‌లాల్ నెహ్రూ ఇందుకోసం నెదర్లాండ్ నుంచి నెస్లే కంపెనీ ప్రతినిధులను పిలిపించాడు. కానీ వారు నెహ్రూను వెటకారం చేశారు. బహిరంగ మరుగుదొడ్ల అలవాటు వల్ల భారతదేశంలో వాతావరణం మొత్తం బ్యాక్టీరియాతో కలుషితమై వుంటుందని. పైగా కండెన్స్‌డ్ పాలు ఆవుపాలతో తప్ప బర్రె పాలతో చేయలేమని చెప్పి, వెళ్లిపోయారు వారు. నెహ్రూ గారు ఒక విధమైన నైరాశ్యంలో మునిగిపోవడం చూసి, సర్దార్ వల్లభాయి పటేల్ ఆయనకొక పేరు సూచించాడు. అతడిని పిలిపించి మాట్లాడండి, సమస్య పరిష్కరిస్తాడని చెప్పాడు. అతడే వర్గీస్ కురియన్. నెహ్రూ గారికి ఆనాడే కురియన్ భరోసా ఇచ్చాడు, బర్రె పాలతో కూడా కండెన్స్‌డ్ పాలు, పాల పొడితో పాటు పాశ్చాత్య దేశాలకు ధీటుగా బట్టర్, చీజ్‌లను సైతం తయారు చేసి ఇస్తానని మాట ఇచ్చాడు. రెండేళ్లలోనే దాన్ని నిజం చేశాడు. ఏ భారతదేశం బ్యాక్టీరియాతో కలుషితమని వెటకారం చేసిన పాశ్చాత్యులు ఇప్పుడు అదే భారతదేశం నుంచి వెన్న, జున్ను, ఇతర పాల ఉత్పత్తులు దిగుమతి చేసుకొంటున్నారు. కురియన్ దేశానికి చేసిన సేవ ఎంత ఘనమైనదో చెప్పడానికి ఇదొక చిన్న ఉదాహరణ మాత్రమే.



### కథ వలె నడిచిన జీవితం

ఆయన జీవితంలో ఇటువంటి కథలు ఎన్నో వున్నాయి. ఒక రకంగా చెప్పాలంటే ఆయన జీవితమే ఒక కథ వలె నడిచి పోయింది. కురియన్ కేరళీయుడు. విద్యార్థి దశలోనే అత్యంత ప్రతిభావంతుడు కావడంతో ఆనాటి బ్రిటీష్ ప్రభుత్వం స్కాలర్‌షిప్ ఇచ్చి, అమెరికాలో చదువుకొనే అవకాశం కల్పించింది. తిరిగిరాగానే గుజరాత్‌లోని ఒక చిన్న పరిశ్రమలో ఉద్యోగం ఇచ్చింది. అప్పట్లో ప్రభుత్వ స్కాలర్‌షిప్ మీద చదువుకొన్నవారు కొంతకాలం విధిగా ప్రభుత్వ ఉద్యోగం చేయాలనే నిబంధన వుండేది. దానితో అయిష్టంగానే గుజరాత్ వెళ్లాడు. సర్దార్ వల్లభాయి పటేల్ సహచరుడైన కేశూభాయి పటేల్ కురియన్‌లో దాగి వున్న అసాధారాణ ప్రజ్ఞ గుర్తించి, తమ గ్రామంలో ప్రారంభించిన సహకార పాల ఉత్పత్తిదారుల సంఘం నిర్వహణలో సహకారం కోరాడు. అప్పట్లో ఆ సంఘం రోజుకి 247 లీటర్ల పాలు మాత్రమే ఉత్పత్తి చేసేదట. అయితే వాటిని అమ్మడానికి నానా బాధలు పడేవారు. బొంబాయి నగరానికి పంపాలంటే, దారిలోనే చెడిపోయేవి. గిట్టుబాటు ధర వచ్చేది కాదు.

### అమూల్ పేరు మారు మ్రోగింది!

కురియన్ రంగ ప్రవేశం తర్వాత ఆ గ్రామ రైతుల ఆర్థిక పరిస్థితి మారిపోయింది. అది చూసి పక్కగ్రామాల వారూ పాల ఉత్పత్తిలో ప్రవేశించారు. సహకార రంగంలో పాల ఉత్పత్తి ఒక ఉద్యమం వలె గుజరాత్ అంతా విస్తరించింది. అమూల్ పేరు ఢిల్లీ దాకా ప్రాకింది. జవహర్‌లాల్ నెహ్రూ ఆయన్ను ఎంతగానో ప్రోత్సహించాడు. ఆ తర్వాత ప్రధాని అయిన లాల్‌బహదూర్ శాస్త్రికి, గుజరాత్ నమూనాలో పాల ఉత్పత్తిని దేశమంతా విస్తరించాలనే ఆలోచన కల్గి, కురియన్ విజయగాథలు చూడడానికి ఆనంద్ గ్రామం వెళ్లాడు.

### రంగంలో దిగిన శాస్త్రి!

కురియన్‌తోపాటు ప్రభుత్వ అధికారులు చెప్పిన మాటలు కాకుండా రైతుల నుంచి నేరుగా తెలుసుకోవాలన్న కోరిక కల్గిందట లాల్ బహదూర్ శాస్త్రికి. కురియన్ సహకారంతో ఆ రాత్రి పాలు సరఫరా చేసే ఒక రైతు ఇంటికి వెళ్లాడాయన. ఆ రోజులలో పత్రికలు, ఫోటోలు, టీవీ ఛానళ్లు లేవు కదా? ఆ రైతుకు తన ఇంటికి వచ్చిందెవరో తెలియదు. కురియన్ స్నేహితుడని మాత్రమే భావించాడు. రైతుకు దగ్గర కావడానికి ఆ రాత్రి లాల్ బహదూర్ శాస్త్రి ఆ రైతు కుటుంబం మొత్తానికి చపాతీలు తానే చేసి ఇచ్చాడట. అట్లా మాటలలో దింపి, పాల ఉత్పత్తిలోని సాధక బాధకాలు తెలుసుకొన్నాడు. తెల్లవారి లాల్‌బహదూర్ శాస్త్రి కోసం ప్రభుత్వ అధికారులు పెద్ద ఎత్తున రావడం చూసిన తర్వాత మాత్రమే ఆ రైతుకు తాను ఆతిథ్యం ఇచ్చింది ప్రధానికి అన్న నిజం తెలిసింది.

### గ్రామానికి నేషనల్ డైరీ బోర్డు

రైతు మాటలు విన్న తర్వాత ఒక్క క్షణం ఆలస్యం చేయలేదు లాల్ బహదూర్ శాస్త్రి. నేషనల్ డైరీ డెవలప్‌మెంట్ బోర్డు స్థాపిస్తాను, దానికి నేతృత్వం వహించమని కురియన్‌ను ఆహ్వానించాడు. అయితే కురియన్ అందుకు చెప్పిన సమాధానం – నేను ఢిల్లీకి రాను. అక్కడ అధికారులు తప్ప రైతులు వుండరు... అన్నాడట. దానిలోని నిజాన్ని గ్రహించిన లాల్‌బహదూర్ శాస్త్రి, నేషనల్ డైరీ డెవలప్‌మెంట్ బోర్డు కేంద్ర కార్యాలయం ఆనంద్ గ్రామంలోనే వుండేట్లు ఉత్తర్వు చేసి మరీ, కురియన్ సారధ్యం సాధించాడు.

గ్రామీణ ప్రాంతాల అభివృద్ధి పట్ల కురియన్‌లో దాగి వున్న చిత్తశుద్ధి, అంకిత భావం ఎంత గొప్పవో ఈ ఒక్క ఉదంతంతో అర్థం చేసుకోవచ్చు. దాని వల్లనే గుజరాత్ సహకార పాల సంఘాల ఉత్పత్తి రోజుకు 247 లీటర్ల నుంచి 350 కోట్ల లీటర్లకు చేరింది. ప్రపంచంలోనే అతి పెద్ద పాల ఉత్పత్తి చేసే దేశంగా భారతదేశం ఖ్యాతి గడించింది. అమూల్ బ్రాండ్‌కు విశ్వవ్యాప్త ప్రాచుర్యం లభించింది. విచిత్రం ఏమిటంటే ఇంత గొప్ప క్షీర విప్లవం సాధించిన కురియన్‌కు పాలు అంటే సరిపడదు. ఆయన జీవితంలో ఒక్క గ్లాసు పాలు కూడా త్రాగలేదట. జీవితమంతా గుజరాత్‌లోనే గడిపిన కురియన్‌కు, గుజరాతీ భాష మాట్లాడడం రాదు. భాష రాకుండానే అక్కడి రైతులతో అత్యంత ఆత్మీయంగా మెలగడం ఆయన గొప్పదనం. సర్దార్ వల్లభాయి పటేల్ తొలిసారిగా ఆనంద్ గ్రామానికి కురియన్‌ను పిలిపించాడు, ఆ గ్రామస్తులెవరూ ఆయనకు వుండడానికి ఇల్లు ఇవ్వడానికి ఇష్టపడలేదు. ఎద్దు మాంసం తినే కేరళ క్రైస్తవుడని ఆయన్ను దూరంగా పెట్టారు. దానితో చాలా సంవత్సరాల పాటు కురియన్ ప్రభుత్వానికి చెందిన ఒక చిన్న గదిలో నివసించాడు. ఆ గ్రామాన్ని ప్రపంచానికే ఒక ఆదర్శంగా మలచాడు.

### దేశానికే ఆదర్శం!

కురియన్ సాధించిన క్షీర విప్లవం వల్ల దేశంలో దాదాపు కోటిన్నర రైతు కుటుంబాలు ఆర్థికంగా ఎంతో ఉన్నతికి వచ్చాయి. వారి ఇళ్లలో జీవన ప్రమాణాల దీపం వెలిగించాడాయన. ఒక్క వ్యక్తి దీక్షా దక్షతల వల్ల కోట్లాది మంది ఆర్థికంగా ఉన్నతి సాధించడం అనేది అబ్బురమైన విషయం. ఎవరైనా అబ్బురపడి తీరవలసిన ఘనత – కురియన్‌ది. తొంభై ఏళ్ల పూర్ణాయుష్షులో పరలోకానికి పయనం కట్టిన ఆ మహా వ్యక్తికి, గ్రామీణ పేదలందరి తరఫునా మా ప్రగాఢ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.




ఫ్రెంచ్, జపాన్ దేశాల వాణిజ్య ఉపగ్రహాలను తీసుకొని శ్రీహరికోట నుంచి నింగిలోకి దూసుకెళ్తున్న పిఎస్ఎల్వి – సి21 రాకెట్.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com